


# ఇదిగో!
# పెప్పర్‌మెంట్ రుచి కలిగిన
# ఒక చాక్‌లెట్ బిస్కట్

## స్క్రంచ్

## కరకర తినే చక్కని తినుబండారం

భారతదేశంలో ఈ రకం రెండు రుచుల తియ్యని తినుబండారం ఇదే మొదటిసారి—చాక్‌లెట్ మరియు మింట్ కలసినది, మృదువయినది, రుచికరమైనది, ఎక్కువ చాక్‌లెట్ క్రీమ్‌తో వున్నది—గోధుమవన్నె గల కరకరలాడే రెండు అందమైన బిస్కట్ల మధ్యవున్న పెప్పర్‌మెంట్ రుచిగల చాక్‌లెట్. ఇటువంటి దానిని మీరు యింతవరకు ఎప్పుడు రుచి చూడలేదు. ఇప్పుడే ఒక్క ప్యాకెట్ బిస్కట్ తీసుకోండి. కరకర నములుతూ తినండి, స్క్రంచ్...స్క్రంచ్...స్క్రంచ్...





## స్క్రంచ్ కరకర తినే చక్కని తినుబండారం

ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు అందచేస్తున్న సరిక్రొత్త తినుబండారం

HTM-AFL-2345

**Results of Chandamama—Camlin Colouring Contest No. 20 (Telugu)**

*1st Prize:* Magapu Dorayya, Kakinada; *2nd Prize:* K. Sumarao, Hyderabad-500 028; *3rd Prize:* M. Srinivas Kumar, Nuzuid-521 201; *Consolation Prizes:* M. D. Sirajuddin, Rajahmundry-533 103; B. Laxmi Narsimha Das, Hyderabad-500 020; B. Jyothi, Hyderabad-500 036; L. Suseela Rani, Kurnool-518-508; C. Krishna Kumari, Calcutta-29.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''కత్తిపట్టిన మంత్రి''] కి ఆధారం బొమ్మిడి అచ్చారావు రచన. ఆస్థానంలో స్థిరపడిపోయిన పండితుల అడ్డంకులు తొలగించుకుని, రాజును దర్శించడం, విద్వాంసుడైన వాడికూ్కడా, ఎంతకష్టసాధ్యమో, ''చమత్కారానికి సత్కారం'' అన్న కథలో వివరించబడింది.

## అమరవాణి

వికృతిం నైవ గచ్ఛంతి సంగదోషేణ సాధవః,
ఆవేష్టితం మహాసర్పైః చందనం న విషాయతే.

[ఉత్తములకు, దుష్టుల సాంగత్యం వల్ల, చెడ్డగుణాలు రావు. చందనవృక్షాన్ని విషసర్పాలు చుట్టుకుని వున్నా, దానికి వాటి విషం అంటదు గదా!]

సంపుటి 69 అక్టోబర్ '81 సంచిక 4

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00








# మర్యాదయిన పద్ధతి

కువలయ్య భార్య పేరు ఏదైనా, అందరూ ఆమెను కువలమ్మ అనే అంటారు. ఎందుకంటే, ఆవిడ కూడా భర్తలాగే మహా పిసినారి. ఈ దంపతులకు పొరుగున రామయ్య, రామమ్మ ఉంటున్నారు. వీళ్ళపద్ధతి కువలయ్య దంపతుల పద్ధతికి పూర్తిగా భిన్నం. రామయ్య, రామమ్మ కూడా జాలిగుండె కలవాళ్ళు.

కువలయ్యది వడ్డీవ్యాపారం. వచ్చిన డబ్బు వెనకవేయడమే తప్ప ఖర్చు పెట్టడమంటూ వుండదు. వాళ్ళ దొడ్లో పళ్ళచెట్లున్నవి. ఆ పళ్ళల్లో ఒక్కగానొక్కటైనా ఇరుగు, పొరుగులకు యివ్వకుండా తినేస్తూంటారు కువలయ్య దంపతులు. ఇంట్లో వంట చేయడమంటూ ఎప్పుడోగాని జరగదు. ఎవరు భోజనానికి పిలిచినా ఆత్రంగా పోయి కడుపారా తిని వస్తూంటారు.

ఒక రోజు రాత్రి కువలయ్య ఇంటి పెరట్లో తిరుగుతూండగా చెట్టు నుంచి సపోటా పండొకటి రాలి గోడ మీద పడి, పొరుగింటి దొడ్లోకి జారిపోవడం అతడి కళ్ళబడింది. అది చూసి కువలయ్య మనసు పాడైపోయింది. భార్యను పిలిచి, జరిగింది చెప్పాడు. వెంటనే గోడ దూకి పోయి పండు తెమ్మన్నది భార్య.

కువలయ్య గోడ దూకాడు. అప్పుడే అతడికి సపోటాపండుతోపాటు కొద్దిగా తెరిచి వున్న రామయ్య వంటింటి తలుపులు కూడా కనబడ్డాయి. వాళ్ళింకా నిద్రపోలేదేమో పలకరించుదామని గుమ్మం దాకా వెళ్ళాడు కువలయ్య. అయితే, వంటింట్లో ఎవరూ లేరు. కానీ, వంటకాల వాసనలు ఘుమఘుమలాడుతున్నాయి. కువలయ్య చప్పున లోపలికి అడుగుపెట్టి, అన్నీ చూశాడు. అతడికి నోరూరింది.

"వసుంధర"

వంటకాలన్నీ పంచెలో మూటకట్టి, సపోటా పండుతో సహా గోడ దూకి ఇల్లు చేరాడు. జరిగింది విని భార్య, అతడు చేసిన పనిని మెచ్చుకున్నది. ఆ రాత్రి యిద్దరూ కలిసి ఆనందంగా విందుభోజనం చేశారు.

మర్నాడు రామయ్య ఇంట్లో ఏదైనా గొడవ వినిపిస్తుందేమో అని, కువలయ్య దంపతులు ఎదురుచూశారు. కాని, అలాంటిదేం జరగలేదు.

"బొత్తిగా లక్ష్యం లేని మనుషులు! అన్ని వంటకాలు పోతే, పట్టనట్టూరుకుంటారా?" అన్నాడు కువలయ్య.

"ఇలాంటి వాళ్ళ కొంపలోంచి, రోజూ అన్నం ఎత్తుకువచ్చినా ఫరవాలేదు," అన్నది కువలమ్మ.

అంతే! ఆ రాత్రి కూడా కువలయ్య గోడ దూకాడు. అయితే, ఈ రోజు వంటింటి తలుపు వేసి వున్నది. కువలయ్య కాస్త తోసి చూస్తే, గడి దానంతటదే చప్పుడు కాకుండా విడిపోయింది. కువలయ్య అన్నం ఎత్తుకుని వెళ్ళిపోయాడు.

మూడవ రోజున కువలయ్య గోడ దూకి వంటింటి తలుపులు తెరవగా, అతడికి అక్కడ వంటకాలే కాక, రెండు పీటలు వేసి వుండడం కనబడింది. వాటి ముందు రెండు విస్తళ్ళు పరిచివున్నాయి.



తన సంగతి రామయ్యకు తెలిసిపోయిందా అని, కువలయ్య అనుమానించాడు. చూద్దాం, ఏమైతే అదవుతుందని అతడు వంటకాలను విస్తళ్ళలోకి సర్దుకుని తీసుకుపోయాడు.

మర్నాడు రామయ్య ఇంటి ముందు చాలా జనం గుమిగూడారు. విశేషమేమిటో అనుకుంటూ కువలయ్య అక్కడికి వెళ్ళాడు.

రామయ్య అక్కడ చేరినవాళ్ళతో, "మా ఇంటికి రోజూ భగవంతుడు వచ్చి, భోంచేసి వెళుతున్నాడు. మొదటి రోజున ఇంట్లో వంటకాలు మిగిలిపోతే, వాటిని దేవుడు తినేశాడు. నేను కుక్క తినేసిం

దనుకున్నాను. అయినా, విషయం తెలుసుకుందామని, రెండో రోజు కూడా వంటకాలెక్కువ వండాం. వంటింటి తలుపు వేసేశాం. అయినా, వంటకాలు మాయమయ్యాయి! ఇది కుక్క పనో, దేవుడి పనో తెలుసుకుందామని, మూడో రోజు విస్తళ్ళు కూడా వేశాం. ఈసారి విస్తళ్ళతో సహా వంటకాలు మాయమయ్యాయి. అంటే, ఇది తప్పకుండా దేవుడి పనే అయుండాలి కదా?'' అన్నాడు.

జనం అంతా అవునన్నారు. ఈ వింత చూడ్డానికి రోజూ రాత్రి జనం రామయ్య దొడ్లో పోగవసాగారు. వారం రోజులు గడిచినా దేవుడు ఆ చాయల కేసి రాలేదు.

''దేవుడు యింతమంది కళ్ళెదుటికి వస్తాడా? రహస్యంగా చూడాలి గానీ,'' అన్నాడు రామయ్య.

ఆ రోజు నుంచీ జనం రహస్యంగా చూడడం మొదలుపెట్టారు.

పాపం, కువలయ్యకిది చాలా యిబ్బంది అనిపించింది. రామయ్య వెర్రిబాగుల వాడు కాబట్టి, దేవుడొచ్చి తిని పోతున్నాడనుకున్నాడు. అంతవరకూ బాగానే వుంది! కానీ, మధ్య యిదేమిటి? జనమంతా కాపలా కాస్తుంటే తన తిండి సంగతి ఏం కావాలి? దేవుడొస్తాడని, ఏ వెధవ ఎక్కణ్ణుంచి రహస్యంగా వంటగది కేసి చూస్తున్నాడో తనకెలా తెలుస్తుంది?



ఈ ప్రచారాన్ని తిరుగుముఖం పట్టించడం కోసం కువలయ్య తన భార్యను ప్రోత్సహించి, రామమ్మ దగ్గిరకు పంపాడు. ఆమె రామమ్మతో, "ఏమమ్మా, వదినా! రోజూ దేవుడొచ్చి మీ ఇంట్లో తిని పోతూంటే, ఆ సంగతి ఊరంతా డప్పు కొట్టించాడు అన్నయ్య. ఇప్పుడు చూడు మరి, దేవుడు రావడం మానేశాడు. అటు అన్నయ్యకూ వెర్రిబాగులవాడన్న పేరు వచ్చింది," అన్నది.

"ఆయనేమీ అంత వెర్రిబాగులవాడు కాదమ్మా, ఆయనది జాలిగుండె, అంతే!" అన్నది రామమ్మ శాంతంగా.

"అంటే?" అన్నది కువలమ్మ ఆశ్చర్యపోతూ.

"వచ్చి తిండి తినిపోయేది దేవుడు కాదనీ, మనిషేననీ ఆయనకు తెలుసు. కాని, అంత రహస్యంగా వచ్చి తిండి ఒక్కటే తినిపోతున్నాడంటే వాడు తిండి కోసం ఎంతగా ముఖం వాచిపోయి వున్నాడో అర్థం చేసుకోవచ్చు. అలాంటి వాడు గర్భదరిద్రుడై వుంటాడు! అన్నార్తుడికి అన్నం పెడితే, అది దేవుడికి పెట్టినట్టే అని, ఆయన అంటూంటారు. అందుకే మేం విస్తరి కూడా వేసి, వాడు తిండి తిని పోయే ఏర్పాటు చేశాం," అన్నది రామమ్మ.

"మీ ఆయన జాలిగుండె సంగతి బాగానే వున్నది. వంట ఇంటి కొచ్చి తిని పోతున్న వాడు గర్భదరిద్రుడు కాక,



ఉన్నవాడేనేమో అన్న ఆలోచన మీక్కలగ లేదా ?'' అని అడిగింది కువలమ్మ.

ఒకవేళ తమ సంగతి రామమ్మకు తెలిసిపోతే, యీ ప్రశ్నతో ఆ విషయం బయటపడుతుందని కువలమ్మ ఆశ.

''ఉన్నవాడైతే, అలా దొంగచాటుగా వచ్చి తిని పోవడం ఎంత సిగ్గుమాలిన పని! తను చేస్తున్న, యీ సిగ్గుమాలిన పని బయట పడితే, వాడెంత అవమానం పాలయిపోతాడు. వాడిని అలా నలుగురిలో అవమానించడం ఆయనకు యిష్టంలేదు. ఆయనది జాలిగుండె అని చెప్పాగదా? అందుకే దేవుడి పేరు చెబుతున్నాడు,'' అన్నది రామమ్మ.

''అలాంటప్పుడు, యీ ప్రచారమంతా ఎందుకు? చాటుగా తినిపోయే వాడు, యీ ప్రచారం వల్లనే గదా రావడం మానేశాడు. మీ ఇంటి దొడ్డిని దేవుణ్ణి చూడవచ్చన్న కోరికతో, ఎప్పుడూ ఎవరో ఒకరు రహస్యంగా చూస్తూండవచ్చునన్న భయంతో, వాడు మీ యింటికి రావడం మానేసి వుంటాడు మరి!'' అన్నది కువలమ్మ.

''అదే కువలమ్మా, మాక్కావలసింది! మేమే వంటింట్లో పొంచి వుండి వాడెవడో తెలుసుకోవచ్చు. కాని, వాడు మాకు స్నేహితుడో, ఏ పొరుగింటివాడో అయుంటే, ఎదటపడి మందలించి, వాణ్ణి అవమానపర్చలేంగదా? రహస్యంగా వచ్చి తిండి తినిపోయే సిగ్గుమాలిన పనిని మానిపించడానికి, మర్యాద అయిన పద్ధతిని ఎన్నుకున్నాం. ఏమంటావు?'' అన్నది రామమ్మ.

రామయ్య దంపతులకు తమను గురించి తెలిసిపోయిందనీ, తమ దురలవాటు మాన్పించడానికి చాలా మర్యాద అయిన పద్ధతి అనుసరించారనీ కువలమ్మకు అర్థమైపోయింది.

ఆమె ఇంటికి వెళ్ళి జరిగింది భర్తకు చెప్పింది. ఆ రోజు నుంచీ కువలయ్య దంపతుల పిసినిగొట్టుతనం క్రమంగా తగ్గసాగింది.






## 18

[శిథిలనగరం నుంచి పారిపోతున్న వ్యాఘ్రదత్త, సమరసేనులకు ఏకాక్షి మాంత్రికుడు ఎదురయ్యాడు. కాని, సమరసేనుడు వ్యాఘ్రదత్తుణ్ణి మోసగించి, మాంత్రికుడి కంటబడకుండా తప్పించుకోగలిగాడు. తనకు విరోధివర్గంలో వాడైన సమరసేనుణ్ణి హతమార్చాలంటే, వ్యాఘ్రదత్తుడు తనకు అన్ని విధాలా సహాయపడగలడని ఏకాక్షికి నమ్మకం కలిగింది. తరవాత—]

ఏకాక్షి మాంత్రికుడికి, వ్యాఘ్రదత్తుడి జవాబుతో పరిస్థితి అర్థమైపోయింది. తనలాగ అతడూ ధనరాసులతో వున్న నావ కోసమే ప్రయత్నిస్తున్నాడని అతడు గ్రహించాడు.

"ధనరాసులతో వున్న నావను వశపరుచుకోవటం మానవమాత్రులకు సాధ్యమయే పని కాదని, నీకు తెలియదా?" అని ప్రశ్నించాడు ఏకాక్షి.

అందుకు వ్యాఘ్రదత్తుడు తల పంకిస్తూ, "శాక్తేయుడి త్రిశూలం వున్నది గదా?" అని జవాబిచ్చాడు.

శాక్తేయుడి త్రిశూలం పేరు వింటూనే ఏకాక్షి నిశ్చేష్టుడయాడు. తనకూ, చతుర్నేత్రుడికీ మాత్రమే ఆ త్రిశూలం సంగతి తెలుసునని అతడి నమ్మకం!

ఇక, వ్యాఘ్రదత్తుడు ప్రాణభీతితో, ఆ త్రిశూలం శిథిలనగరంలోని ఏనుగుల



వనంలో, గురుద్రోహి అస్థిపంజరం కింద వున్నదని చెప్పేశాడు. శివదత్తుడు దాని కోసం ప్రయత్నిస్తున్నాడనీ, సమరసేనుడు కూడా అక్కడికే పోయి వుంటాడనీ వ్యాఘ్రదత్తుడు చెప్పగానే, ఏకాక్షి క్రోధంతో వణికిపోయాడు.

"వ్యాఘ్రదత్తా, యీ కార్యం సాధించటానికి మన యిద్దరం ఒకళ్ళకొకళ్ళు సహాయం చేసుకోక తప్పదు. సమరసేనుడికి, చతుర్నేత్రుడనే ఒక తుచ్ఛ మాంత్రికుడు యీ కార్యంలో సహాయపడవచ్చు. కనక, ముందుగా మనం శిథిల నగరం చేరి, శాక్తేయుడి త్రిశూలం చేజిక్కించుకోవటం ఉత్తమం. వెంటనే, అక్కడికి ముందుండి దారిచూపు," అన్నాడు ఏకాక్షి.

కొంతదూరం వెళ్లగానే, ఏకాక్షి తన వేగుల కేసి చూసి, "కపాలా! కాలభుజంగా! మీరు ముందు వెళ్లి, ఆ సమరసేనుణ్ణి వెతకండి," అని ఆజ్ఞాపించాడు.

వేగులు వెళ్ళిన కొద్దిసేపట్లోనే ఏకాక్షి, వ్యాఘ్రదత్తుడూ అదిరిపడేలా నల్లగూబ కంఠస్వరం వినబడింది. అది ఏకాక్షి తల మీదుగా ఎగురుతూ, "చతుర్నేత్రా! ఏకాక్షి! ఏకాక్షి!" అని అరవసాగింది.

ఏకాక్షి భయంతో కంపించిపోతూ, ఎడమ చేతితో కన్ను మూసుకుని, కుడి చేతితో కత్తిని గాలిలో తిప్పుతూ, "కపాలా! కాలభుజంగా!" అని కంపిస్తున్న కంఠంతో కేకలు పెట్టాడు.

కాని, ఏకాక్షి ఎంత అరిచినా అతడి వేగులు అక్కడికి రాలేదు. ఇప్పుడు ఏమి చేయటమా అని అతడు ఆలోచించేంతలో, నల్లగూబ అక్కడినుంచి ఎగిరిపోయింది.

వ్యాఘ్రదత్తుడూ, ఏకాక్షి ఏనుగుల వనం ప్రవేశించారు. అప్పుడు వ్యాఘ్రదత్తుడు, "ఏకాక్షి మహాశయా, ఇదే ఏనుగులవనం! పడగవిప్పి బుసకొడుతున్న పాముల వంటి ఆకులతో వున్నదే విషవృక్షం. ఆ కనబడే సమాధి కిందే శాక్తేయుడి త్రిశూలం వున్నది," అన్నాడు.

ఆ మాటలతో ఏకాక్ష పరమానందం చెందాడు. "సరే, వ్యాఘ్రదత్తా! అదిగో, యిటే వస్తున్న శివదత్తుణ్ణి నీ భటులతో ఎదుర్కొ. ఈ లోపల త్రిశూలం సంపాయించే సంగతి నేను చూస్తాను," అంటూ వ్యాఘ్రదత్తుణ్ణి ప్రోత్సహించాడు.

వ్యాఘ్రదత్తుడు ముందు వెనుకలు చూడకుండా, ఉన్న కొద్దిమంది భటులతో శివదత్తుడి అనుచరుల మీదికిదూకాడు.

శివదత్తుడి అనుచరులు వ్యాఘ్రదత్తుడి భటుల కన్న మూడింతలున్నారు. ఆ కారణం చేత వ్యాఘ్రదత్తుడి భటులు చావు దెబ్బలు తిని కింద పడసాగారు.

ఈ పరిస్థితిలో తనకు రానున్న ప్రమాదాన్ని గుర్తించాడు, ఏకాక్ష. అతడు ఎలుగెత్తి, "కపాలా! కాలభుజంగా!" అంటూ అరవసాగాడు. ఆ మరుక్షణం కపాలం, కాలభుజంగం అక్కడికి వచ్చినై.

శివదత్తుడి అనుచరులు వాటిని చూస్తూనే గుండెలదిరి పారిపోసాగారు.

"వ్యాఘ్రదత్తా, యిదే మనకు మంచి అదను! శాక్తేయుడి త్రిశూలం వున్న ఆ సమాధి ప్రాంతాన్ని, నీ భటులతో వెంటనే తవ్వించు," అన్నాడు ఏకాక్ష.

వ్యాఘ్రదత్తుడి కూడా తన విజయం నిస్సందేహం అనిపించింది. సమరసేనుడూ, చతుర్నేత్రుడూ అక్కడికి వచ్చే లోపుగా తను ఆ దివ్యశక్తులు గల త్రిశూలం వశపరుచుకోవచ్చు అనుకున్నాడు. అతడు తన భటులను హెచ్చ






రిస్తూ, ముందుకుపోయి మృతవీరుల సమాధిని స్వయంగా తవ్వసాగాడు. అంతలో అక్కడికి వందగజాల దూరంలో వున్న విషవృక్షం నుంచి మూలుగులు వినిపించసాగినై. పడగ విప్పిన పాముల వలె వున్న ఆ చెట్టు ఆకులు బుసలుకొట్ట ప్రారంభించినై.

ఏకాక్ష మాంత్రికుడు విషవృక్షాన్ని సమీపించాడు. తన చేతనున్న కత్తిని పైకెత్తి, ఏదో మంత్రం పఠించనున్నంతలో, వ్యాఘ్రదత్తుడి కంఠం నుంచి జాలికొలిపే ఆర్తనాదం వినిపించింది. ఏకాక్ష వెనక్కు తిరిగి చూశాడు. చతుర్నేత్రుడి వేగు నరవానరం, వ్యాఘ్రదత్తుణ్ణి చేతుల్లో బంధించి గిరగిర తిప్పుతున్నది. నల్లగూబ, ''ఏకాక్ష! ఏకాక్ష!'' అని అరుస్తూ విషవృక్షం కేసి వస్తున్నది.

ఇది చూసి ఏకాక్ష కంగారుపడ్డాడు. తను శాక్తేయుడి త్రిశూలాన్ని వెతికి పట్టుకోకముందే, చతుర్నేత్రుడూ, సైనికులతో సమరసేనుడూ ఆ ప్రదేశానికి రావచ్చని అతడికి భయం కలిగింది. అతడు కాలభుజంగాన్ని పిలిచి, నరవానరం మీదికి ఉసికొలిపాడు. దూరంగా వున్న గుట్టల మీదికి వ్యాఘ్రదత్తుణ్ణి విసిరివేసి, నరవానరం, కాలభుజంగం మీద కలియబడింది. పైన కపాలం, నల్లగూబ భయంకరంగా పోరాడసాగినై.

ఏకాక్ష మాంత్రికుడు భయపడినదంతా నిజమైంది. చతుర్నేత్రుడు, '' ఉలూకా! నరవానరా!'' అంటూ అక్కడికి రానే వచ్చాడు. సమరసేనుడి వెంట కొందరు సైనికులున్నారు. పారిపోతున్న శివదత్తుడూ, అతడి అనుచరులు కూడా కొంత తెప్పరిల్లి, ఆ ప్రదేశానికి తిరిగి వస్తున్నారు. చావగా మిగిలిన వ్యాఘ్రదత్తుడి భటులు వాళ్లను ఎదుర్కొన్నారు.

కాలభుజంగం విషపు కోరల కాటు నుంచి తప్పుకుంటూ, నరవానరం దానిని ఒక పెద్ద రాతిగదతో కొట్టసాగింది. నల్లగూబ కూడా కపాలపు బొసినోటికి అంద

కుండా దానిని కాళ్ళతో తన్నుతూ, ముక్కుతో పొడవసాగింది.

తన పరిస్థితి చాలా ప్రమాదకరంగా పరిణమిస్తున్నదని గ్రహించిన ఏకాక్షి మాంత్రికుడు కత్తిదూసి, చతుర్నేత్రుడి మీదికి వచ్చాడు. చతుర్నేత్రుడు కూడా ఏమాత్రం జంకక అతణ్ణి ఎదుర్కొన్నాడు. ఈలోపల చతుర్నేత్రుడి సలహాప్రకారం సైనికులను వెంటబెట్టుకుని సమరసేనుడు సమాధి తవ్వసాగాడు.

మృతవీరుల సమాధిని తవ్వుతున్న సమరసేనుడికి లోపలి నుంచి వింత అరుపులూ, వికృతమైన నవ్వులూ వినిపించసాగినై.

సమరసేనుడు ఏమాత్రం భయపడలేదు. తమ నాయకుడి గుండె నిబ్బరం చూసిన సైనికులు మృతవీరుల సమాధిని అట్టడుగువరకూ తవ్వేశారు.

సమాధిలో ఒకే ఒక అస్థిపంజరం కనబడింది. అది గురుద్రోహి అస్థిపంజరం అని సమరసేనుడు గ్రహించాడు. ఆ అస్థిపంజరం గుండెల్లో నిలువునా గుచ్చుకుని శాక్తేయుడి త్రిశూలం కనబడింది. వణుకుతున్న చేతుల్తో సమరసేనుడు అస్థిపంజరం నుంచి త్రిశూలాన్ని బయిటికి గుంజాడు. మరుక్షణం అస్థిపంజరం గాలిలోకి లేచి, "గురూ, శాక్తేయా!




ఈనాటితో నాకు శాపవిముక్తి కలిగింది. నేను తిరిగి శమనద్వీపానికి పోతున్నాను!" అంటూ రివ్వున గగనమార్గాన బయలుదేరింది.

అస్థిపంజరం ఆ విధంగా పలుకుతూ ఆకాశమార్గాన ఎగిరిపోవటం చూసేసరికి, ఏనుగులవనంలో వున్న ప్రతి ఒక్కడికీ గుండెలు అవిసిపోయినై. ఏకాక్షి ఎత్తిన కత్తి అలాగే పట్టుకుని, ఎగిరిపోతున్న గురుద్రోహి అస్థిపంజరం కేసి కన్నార్పకుండా చూడసాగాడు. సమరసేనుడు చతుర్నేత్రుణ్ణి సమీపించి, శాక్తేయుడి త్రిశూలాన్ని అతడి చేతికి అందించాడు. ఏకాక్షి తన దృష్టిని అస్థిపంజరం మీది

మంచి చతుర్నేత్రుడి కేసి తిప్పేసరికి, అతడి కంటికి మెరుస్తూన్న శాక్తేయుడి త్రిశూలం కనబడింది. వెంటనే అతడు ఒక చావు కేకపెట్టి, "కపాలా! కాల భుజంగా!" అని అరుస్తూ పారిపోసాగాడు.

"చతుర్నేత్రా! ఆ పాపిని ప్రాణాలతో పోనివ్వకండి," అన్నాడు సమరసేనుడు.

ఆ మాటలకు చతుర్నేత్రుడు నవ్వి, "సమరసేనా, ఏకాక్ష ఎక్కడికీ పారి పోలేడు. మనం ఏ క్షణాన కావాలంటే ఆ క్షణాన, యీ త్రిశూలం—వాడెక్కడ దాగివున్నాసరే పోయి హతమార్చగలదు!" అంటూ త్రిశూలాన్ని ఏకాక్షి కేసి విసురుతూ, "ఆ గురుద్రోహి తమ్ముడైన ఏకాక్షని హతమార్చిరా!" అన్నాడు.

త్రిశూలం మెరుపులా గాలిలోకి ఎగిరి, ఏకాక్ష మాంత్రికుణ్ణి సమీపించి, బలంగా గుండెల్లో పొడిచింది. "అబ్బా!" అని అరుస్తూ, ఏకాక్ష కిందపడిపోయాడు.

త్రిశూలం తిరిగి వచ్చి చతుర్నేత్రుడి పాదాలముందు పడింది.

"చతుర్నేత్రా, పనిలోపని, కపాలుణ్ణీ, కాలభుజంగాన్నీ కూడా తుదముట్టించు!" అన్నాడు సమరసేనుడు ఉత్సాహంగా

"ఏకాక్షి చావు తరవాత కపాలం, కాలభుజంగం ఎవరికీ హాని కలిగించ లేవు," అన్నాడు చతుర్నేత్రుడు.



తరవాత అతడు ఒక క్షణం ఆగి, "సమరసేనా! మనం తూర్పు తీరం చేరి, ఆ ధనరాసులతో వున్న నావను వశపరచుకుందాం," అన్నాడు.

అందరూ కలిసి అడవిదారుల వెంటా, కొండలోయలగుండా నడిచి, మరుసటి రోజు సాయంత్రం వేళకు తూర్పుతీరం చేరారు. ధనరాసులతో నిండివున్న నావా, దానిని కాపలా కాస్తున్న నాగకన్యా సముద్రంలో తేలియాడుతూ కనిపించారు.

చతుర్నేత్రుడు తన చేతనున్న శాక్తేయుడి అపూర్వశక్తులు గల త్రిశూలాన్ని మంత్రించి, నావ కేసి విసిరాడు. త్రిశూలం మెరుపువేగంతో పోయి నావను తాకింది.

మరుక్షణంలోనే నాగకన్య, నావచుక్కాని చేతబట్టి, దానిని తీరానికి చేర్చింది.

"నేను శమనద్వీపపు రాజైన శాక్తేయుడి శిష్యుణ్ణి. నా పేరు చతుర్నేత్రుడు. ఇది మంత్రశక్తి గల ఆయన త్రిశూలం. గురువాజ్ఞ తెలుసుగదా? నువ్వు నా భార్యవు!" అన్నాడు చతుర్నేత్రుడు నాగకన్యతో.

నాగకన్య ఆ మాటలు వింటూనే చుక్కాని వదిలి, ముందుకు వచ్చి, చతుర్నేత్రుడికి ప్రణమిల్లింది. సమరసేనుడూ, సైనికులూ ఉత్సాహంగా జేజేలు పలికారు.

చతుర్నేత్రుడు, సమరసేనుడి కేసి తిరిగి, "సమరసేనా! ఈనాటి నుంచి మేము భార్యాభర్తలం. ఈ మంత్రాల దీవిలో శాంతంగా కాలం గడపదలిచాం. నువ్వు వచ్చిన పని విజయవంతంగా ముగిసింది. నావలోని ధనరాసులతో మీ కుండలినీ ద్వీపం చేరవచ్చు," అన్నాడు.

అప్పటికప్పుడే సమరసేనుడు ప్రయాణ సన్నాహాలు పూర్తి చేశాడు. అతడు చతుర్నేత్రుడికి తన కృతజ్ఞత తెలియపరిచాడు. చతుర్నేత్రుడు అతణ్ణి దీవించి, తన భార్య అయిన నాగకన్యతో అరణ్యం కేసి వెళ్ళిపోయాడు.

భూకంపాలతో, భయంకర మృగాలతో నిండి వున్న మంత్రాలదీవి తమకు వాస యోగ్యం కాదని నిశ్చయించుకున్న శివదత్తుడూ, అతడి అనుచరులు కూడా సమరసేనుడితో కుండలినీ ద్వీపానికి బయలుదేరారు. నిర్మలంగా, ప్రశాంతంగా వున్న సముద్రంలో ఒక మాసం రోజులు ప్రయాణం చేసి, ఒకనాటి ఉదయ కాలంలో అందరూ కుండలినీ ద్వీపం చేరారు.

ఎంతో కాలం తరవాత తిరిగి వచ్చిన సమరసేనుడికీ, సైనికులకూ ద్వీప ప్రజలూ, రాజైన చిత్రసేనుడూ ఘనమైన స్వాగతం యిచ్చారు. ఎన్నో ధనరాసులు గల నావను కూడా వెంట తెచ్చినందుకు ప్రతి ఒక్కరూ పరమానందం చెందారు.

—(అయిపోయింది)






# కత్తి పట్టిన మంత్రి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకు గల ఉదారగుణం అందరికీ వుండదు. ఇతరుల మేలు కోసం నువ్వు పడే శ్రమ చూస్తుంటే, నాకు జాలి కలుగుతున్నది. ఒక్కొక్కసారి మేలు పొందిన వాళ్ళ నుంచి కృతజ్ఞత కాక, దూషణ, తిరస్కారాలు ఎదురయ్యే ప్రమాదం వున్నది. ఇందుకు ఉదాహరణగా నీకు, సౌగంధ రాజు కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

సౌగంధరాజు గుణపాలుడికి రణపాలుడనే కొడుకున్నాడు. అలాగే ఆయన మంత్రికి జయవర్మ అనే కొడుకూ, సేనాపతికి వీరసింహుడనే కొడుకూ వున్నారు.

## బేతాళ కథలు



ఈ ముగ్గురూ ఒకే యీడువాళ్ళు. ఒకే గురువు దగ్గిర అన్ని విద్యలూ నేర్చుకున్నారు. రణపాలుడు సింహాసనానికి వచ్చినప్పుడు అతడి కాబోయే మంత్రి జయవర్మ అనీ, సేనాని వీరసింహుడనీ ఏనాడో నిర్ణయం జరిగిపోయింది.

రణపాలుడికి వేట అంటే చాలా మక్కువ. ఒకనాడు అతడు మంత్రి కొడుకు జయవర్మనూ, సేనాని కొడుకు వీరసింహుణ్ణీ, కొంత పరివారాన్నీ వెంట బెట్టుకుని అరణ్యానికి వేటకు వెళ్ళాడు.

సూర్యోదయంతో అరణ్యం చేరి, వేట ప్రారంభించినవాళ్ళు, సాయంత్రం వరకూ అల్లా వేటాడుతూనే వున్నారు. రణపాలుడు యిలాంటి సమయాల్లో ఆకలిదప్పులను లెక్కచెయ్యడు. ఆ రోజు అతడు ఎన్నో క్రూరమృగాలనూ, లేళ్ళనూ వేటాడి బాగా, అలసిపోయాడు. కనుచీకటి పడుతున్న సమయంలో ఒక పులి హఠాత్తుగా పొదలచాటు నుంచి రణపాలుడి మీదికి దూకింది. రణపాలుడు యీ దాడిని ఎదుర్కొనేందుకు తయారైలేడు. కొంచెంలో అతడు పులి పంజా దెబ్బకు ఆహుతి అయిపోవలసినవాడే! కాని, సమయానికి సేనానికొడుకు వీరసింహుడు అడ్డుపడి, పులిని చంపేశాడు.

రణపాలుడు, వీరసింహుణ్ణి గాఢాలింగనం చేసుకుని, "మిత్రమా, యీ రోజు నా ప్రాణం కాపాడావు. నువు సమయానికి పక్కన లేకపోతే, నేను పులి వాతపడి వుండేవాణ్ణి," అన్నాడు కృతజ్ఞతగా.

వీరసింహుడు సంతోషంగా, "యువరాజా, యిది నా ధర్మం!" అన్నాడు.

పరివారంతో కలిసి రణపాలుడు నగరానికి బయలుదేరాడు. అతడూ, మంత్రి కొడుకు జయవర్మా ముందు నడుస్తున్నారు. వీరసింహుడు పరివారంలోని ముఖ్యుడొకడితో మాట్లాడుతూ, వెనకగా వస్తున్నాడు.

ఆ సమయంలో ఒక చెట్టుచాటు నుంచి, ఉదయం వేటలో గాయపడిన



ఒక ఆడపులి, మెరుపులా వచ్చి, రణపాలుడి మీద దూకబోయింది. రణపాలుడు కత్తి దూశాడు గాని, అది పులి పంజా దెబ్బకు జారి కిందపడిపోయింది. మంత్రి కొడుకు జయవర్మ చప్పున కింద పడిన కత్తి తీసుకుని, పులి గుండెల్లో గట్టిగా ఒక పోటు పొడిచి, దాన్ని చంపేశాడు.

ఈ గొడవ జరుగుతున్నప్పుడు దూరంగా వున్న వీరసింహుడు పరుగు, పరుగున అక్కడికి వచ్చి, యువరాజుకు మరొక ప్రమాదం తప్పినందుకు చాలా ఆనందించాడు.

మర్నాడు నగర ప్రజలు యీ జరిగినదంతా విని, యువరాజు ప్రాణాలను కాపాడిన వీరసింహ, జయవర్మలను ఎంతగానో అభినందించారు. రాజు గుణపాలుడు సభ ఏర్పాటు చేసి వీరసింహుణ్ణీ, జయవర్మనూ పిలిపించాడు. సభలో వున్న సేనాపతీ, మంత్రీ తమ కుమారులకు ఘనంగా సన్మానం జరుగుతుందని సంతోషించసాగారు.

రాజు గుణపాలుడు సభికులందరినీ ఓమారు కలయచూసి, "నా కుమారుడూ, భావి సౌగంధరాజూ అయిన రణపాలుడికి వేట సమయంలో జరిగిన ప్రమాదాలను గురించి, మీరందరూ వినే వుంటారు. నా కుమారుడి ప్రాణం కాపాడినందుకు మంత్రి కుమారుడైన జయవర్మకు, యీ పచ్చలహారం యిస్తూ, ప్రత్యేకంగా అభినందనలూ, నా కృతజ్ఞతా తెలుపుకుంటున్నాను. సేనాని కుమారుడైన వీరసింహుణ్ణి, యీసారికి క్షమిస్తున్నాను," అన్నాడు.

ఈ మాటలు విని సభలో వున్న వారంతా నిర్ఘాంతపోయారు. వాళ్ళు జయవర్మతోపాటు, వీరసింహుణ్ణీ రాజు సన్మానిస్తాడనుకున్నారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సౌగంధరాజు గుణపాలుడి ప్రవర్తన విడ్డూరంగా లేదా? తన కుమారుడి

ప్రాణాలను కాపాడిన వీరసింహుణ్ణి సన్మానించకపోగా, యీసారికి క్షమించానని నిండు సభలో దూషించడం కృతఘ్నతకాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు ప్రవర్తనలో విడ్డూరం గాని, కృతఘ్నత గాని ఏమీ లేదు. వీరసింహుడు సేనాని కొడుకు; భావి సేనాని. సేనాని అయినవాడు తన రాజు క్షేమం కోసం, ప్రాణాన్ని పణంగా పెట్టి పోరాడుతాడు. రాజు జయాపజయాలు సేనాని ప్రతిభ మీదనే ఆధారపడి వుంటాయి. రాజు ప్రాణరక్షణ సేనాని ప్రథమ కర్తవ్యం; విధ్యుక్త ధర్మం! ఆ కారణం వల్ల రణపాలుడి ప్రాణాలు కాపాడడం వీరసింహుడి వృత్తి ధర్మం. అది ప్రత్యేక ప్రశంసకు అర్హమైందికాదు.

ఇకపోతే, జయవర్మ మంత్రి కుమారుడు. అతడు రాజుకు సలహాదారుడు మాత్రమే. రాజు ప్రాణాలు కాపాడడంలో పరోక్షంగా అతడి మేధాశక్తి సహాయపడుతుందే గాని, తనకై తాను కత్తిపట్టి రాజ్యరక్షణకు పూనుకోవలసిన అవసరం లేదు. కాని, జయవర్మ ఆపదలో అడ్డుపడి, భావి సౌగంధరాజు ప్రాణం కాపాడాడు. అందుకే రాజు అతణ్ణి సన్మానించాడు. నిజానికి రెండవసారి కూడా వీరసింహుడే అడ్డుపడి, రణపాలుణ్ణి రక్షించవలసివున్నది. కాని, అతడు తన బాధ్యత మరచిపోయి, ఎవరితోనో కబుర్లాడుతూ, సమయానికి దగ్గిర లేడు. ఇదీ వీరసింహుడు చేసిన అపరాధం! ఇందుకు సౌగంధరాజు అతణ్ణి ఎంత కఠినంగా శిక్షించినా, తప్పుకాదు. కాని, ఆయన అలా చేయకపోవడం ద్వారా, గొప్ప ఉదారుణ్ణని రుజువు చేసుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# మోసాల పద్దు

రామనాథయ్యా, శివరామయ్యా ప్రతి ఏడూ పోటీలుపడి, ఒకరు ఉత్తరదేశ యాత్రకూ, మరొకరు దక్షిణదేశ యాత్రకూ వెళ్ళి వచ్చేవాళ్ళు. రామనాథయ్య మాత్రం యాత్ర నుంచి తిరిగి రాగానే, యాత్రలకైన ఖర్చూ, దారిలో రకరకాల మోసాలకు గురై పోగొట్టుకున్న డబ్బూ లెక్క వేసుకుని, తెగ బాధపడిపోయేవాడు. అయితే, శివరామయ్య మాత్రం నిమ్మకు నీరెత్తినట్టు నిబ్బరంగా వుండేవాడు.

ఒకరోజు రామనాథయ్య వుండబట్టలేక, "శివరామయ్యా! ప్రతి ఏడూ దేశయాత్రల్లో రకరకాల మోసాలకూ గురై, బోలెడు నష్టపోతూ బాధపడుతున్నాను. నీ కిలాంటి యిబ్బంది కలక్కుండా వుండేందుకేం చేస్తూంటావు?" అని అడిగాడు.

శివరామయ్య చిన్నగా నవ్వి, "యాత్రా ప్రదేశాల్లో కొత్తవాళ్ళమైన మనను, స్థానికంగా వుండేవాళ్ళు ఏదో రకంగా మోసపుచ్చుతూనే వుంటారు. ఈ బాధ తప్పనిసరిగదా? అందుకే ప్రయాణంలో భోజనాల ఖర్చు పద్దు, బళ్ళకిరాయి పద్దు, గుళ్ళల్లో పూజ పద్దులాగే, మోసాలకు గురయ్యే డబ్బు పద్దు అంటూ ముందే అనుకుని బయలుదేరతాను. ఆ కారణంగా తరవాత బాధపడే అవసరం నా క్కలగదు," అన్నాడు.

రామనాథయ్యకు అసలు రహస్యం బోధపడింది.

—ఎమ్. డి. సౌజన్య





# చమత్కారానికి సత్కారం

నగరానికి పోయే దారి పక్కన వున్న ఒక చెట్టు నీడలో, యిద్దరు మనుషులు నిద్రపోతున్నారు. వాళ్ల పక్కన వున్న మూటలకు మరొకడు కాపలా కూర్చున్నాడు. అ సమయంలో అక్కడికి ఇంకొకడు వచ్చి, వాళ్ళకు కొంచెం దూరంలో చెట్టు నీడన కూర్చున్నాడు. ఈ కొత్తగా వచ్చిన వాడి దుస్తుల తీరు చూస్తే, ధనికుడిలా వున్నాడు.

అతను కాపలా కూర్చున్న వాడికేసీ, నిద్రపోతున్న వాళ్ళకేసీ చూశాడు. వాళ్లు చాలా బీదవాళ్ళని అతడికి తోచింది.

"ఎవరు మీరు?" అని అడిగాడు ధనికుడు.

కాపలా కూర్చున్నవాడు నిద్రపోతున్న వాళ్ళల్లో ఒకణ్ణి చూపుతూ, "అతను తిండి యాచించలేనివాడు," అని, రెండవ వాణ్ణి చూపి, "ఆయన కావాలంటే పొందలేని వాటి లోటువల్ల, బతుకు తెరువు తెలియనివాడు. మేం ముగ్గురం ప్రశాంతంగా వుందామని యిక్కడ చేరాం. ఉంచదలుచుకున్నా వుండని వస్తువులతో యాచన చేస్తూ, ఆగమన్నా ఆగనిదాన్ని గడుపుతున్నాం," అన్నాడు.

అతడు యింత చమత్కారంగా చెప్పిన విషయాలకు సంతోషించి, ధనికుడు అతడికి కొంత డబ్బిచ్చి, "నేను ఈ దేశపు రాజుగారి ఆప్తుల్లో ఒకణ్ణి. రేపు మీరు సభకు వచ్చి ఆయన దర్శనం చేసుకుంటే, తగిన పారితోషికం యిస్తారు," అని సభా ప్రవేశానికి ఒక అనవాలు యిచ్చాడు.

ఆ మర్నాడు రాజు సత్యవంతుడు సభలో వున్న వారితో, "తిండి యాచించ లేనివాడు ఎవరు? కావాలంటే పొందలేనివి ఏమిటి? మనుషులు ప్రశాంతంగా ఎప్పుడుంటారు? ఉంచదలుచుకున్నా, వుండని

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

దేమిటి? ఆగమన్నా ఆగనిదేమిటి? ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలు చెప్పిన వారికి, తగిన పారితోషికం యిస్తాను,'' అన్నాడు.

సభలో అందరూ ముఖముఖాలు చూసుకున్నారే తప్ప, ఏ ఒక్కరికీ యీ ప్రశ్నలకు సరిఅయిన సమాధానాలు తోచలేదు.



రాజు కొద్దిసేపు ఆగి, ''సభాసదుల్లో చాలామంది పండితులున్నారు. అలాంటి వారికూడా యీ ప్రశ్నలకు సమాధానాలు దొరక్కపోవడం ఆశ్చర్యంగా వుంది,'' అన్నాడు చిరాకు పడుతూ.

అంతలో ఒక భటుడు వచ్చి, ''ప్రభూ, ఎవరో ముగ్గురు వ్యక్తులు తమ దర్శనం చేసుకోవాలంటున్నారు. చూడటానికి కడు పేదల్లా వున్నారు. ఈ ఆనవాలు తెచ్చారు,'' అంటూ రాజుకు ఒక ఆనవాలు చూపించాడు.

రాజు వాళ్ళను సభలో ప్రవేశపెట్టమని ఆజ్ఞాపించాడు. వాళ్ళు ముగ్గురూ సభలోకి వచ్చి, భటుడు చూపిన స్థానాల్లో కూర్చున్నారు. రాజు ప్రశ్నార్థకంగా చూడగానే ఆ ముగ్గురిలో ఒకడు లేచి, ''ప్రభూ, నా పేరు వీరభద్రుడు. ప్రభువులకు నా పాండిత్యం ఏపాటిదో తెలియపరిచి, సత్కారం పొందాలంటే, నాకు యింత కాలంగా సభాప్రవేశం లభించింది కాదు. నా తండ్రి, అన్నలను వెంటబెట్టుకుని చాలీచాలని తిండితో కాలం గడుపుతున్నాను. అదృష్టంకొద్దీ నిన్న ఒక ధనికుడు సహాయం చేసి, ఆనవాలు యివ్వడం వల్ల యిక్కడికి రాగలిగాను,'' అన్నాడు.

అప్పుడు రాజుగారి ఆంతరంగికుడు సారధి ఆసనం మీది నుంచి లేచి, ''మహారాజా, తమకు మనవి చేసింది, యితణ్ణి గురించే,'' అన్నాడు.

అంతలో సభా ముఖాన చిన్న కలకలం రేగింది. ఒక వృద్ధుడు రాజును సమీపించి, ''మహారాజా, యింతకు ముందు

మీరడిగిన ప్రశ్నలకు, నా మనమరాలు సమాధానం చెప్పగలదు. తమరు అవకాశం యిప్పించాలి,'' అన్నాడు.

ఈసారి సభలో చిన్నగా నవ్వులూ, గుసగుసలూ బయలుదేరాయి. వృద్ధుడు కోపంగా సభాసదులకేసి చూసి, రాజుతో, ''మహారాజా, మన ఆస్థానపండితులు తమ గొప్పతనానికి ఎక్కడ హాని కలుగుతుందో అని, ప్రతిభావంతులైన కొత్త వారికి తమ దర్శనం కలగకుండా అడ్డుకుంటున్నారు. ఆ కారణం వల్లనే ఎంతో విద్వాంసురాలైన, నా మనమరాలికి, యీ నాటివరకూ తమ దర్శనభాగ్యం కలగలేదు,'' అన్నాడు.

రాజు ఒక భటుణ్ణి పంపి, వృద్ధుడి మనమరాలిని సభకు పిలిపించాడు. ఆమె పేరు కాత్యాయిని. ఆమె ముఖవర్చస్సూ, హుందాతనం చూసి సభికులంతా అచ్చెరువు చెందారు.

రాజు కాత్యాయినికి, తాను లోగడ సభనుద్దేశించి అడిగిన ప్రశ్నలు విని పించాడు. ఆమె వెంటనే తడువుకోకుండా, ''మహారాజా, తిండి యాచించలేనివాడు మూగవాడు. ఈ విషయం కొంచెం తర్కించుకుంటే, ఎవరికైనా బోధపడుతుంది. కావాలంటే పొందలేనివి, తెలివితేటలు. అవి చాలావరకూ పుట్టుకతో అబ్బేవి. ప్రతి మనిషీ ప్రశాంతంగా వుండగలిగేది ఒక్క నిద్రా సమయంలో మాత్రమే. ఉంచదలచుకున్నా వుండనిది, శరీరం. ఇక, ఆగమంటే ఆగనిది కాలం! ఈ వాస్తవాలను వీరభద్రుడు చమత్కారంగా—తాను, మూగవాడైన తండ్రి, తెలివితేటలులేని అన్నతో యాచన చేస్తూ, బతుకు భారంతో కుంగిపోతున్నానని చెప్పాడు,'' అన్నది.

ఆ సమాధానానికి రాజు సత్యవంతుడితో పాటు, సభలోని వారందరూ హర్షధ్వానాలు చేశారు.

రాజు, వీరభద్రుణ్ణీ, కాత్యాయినినీ ఎంతగానో ప్రశంసించి, వారిని ఘనంగా సత్కరించాడు.





# గొప్పవాళ్ళ మోసం

పూర్వం ఒకానొక నగరంలో ఒక ధర్మకర్త ఉండేవాడు. ఆయనకు అనాథలను చూస్తే అపరిమితమైన జాలి. అటువంటి వారిని చేరదీసి, వారికి కలిగిన బాధలు తొలగించి, ఎంతగానో సహాయపడేవాడు.

ఆ నగరంలోనే ఒక బిచ్చగాడు ఉండేవాడు. వాడు రకరకాల వేషాలు వేసి ప్రజలుచేసే దానాలతో పొట్టపోసుకుంటూ ఉండేవాడు. ఫలానా ధర్మకర్తగారు గొప్ప దాత అనీ, ధర్మాత్ముడనీ వాడికి తెలిసింది. ఆయన దగ్గిర పెద్ద దానం పుచ్చుకోవాలని బిచ్చగాడికి కోరిక కలిగింది. వాడు తన కాలికి ఏవో పసర్లు రాచుకుని లావుగా వాచేటట్టుగా, కాలికి పెద్దవ్రణం వచ్చినట్టుగా చేసుకున్నాడు. ఇటువంటి విద్యలలో వాడు నేర్పరి కావటం చేత సామాన్యులెవరూ మోసం కనిపెట్టలేరు. ఈ కాలుతో బిచ్చగాడు బాధపడుతున్నట్టు మూలుగుతూ ఒకనాటి ఉదయం ధర్మకర్తగారి భవంతి బయట కూర్చున్నాడు. ధర్మకర్తగారి ఇంటికి వచ్చేపోయే జనం వాణ్ణి చూసి జాలిపడి చిల్లరడబ్బులు వేయసాగారు. కాని వాడికి కావలిసింది ధర్మకర్తగారి దానం, అందుచేత వాడు ఆ స్థలం విడిచిపెట్టి పోలేదు.

కొంతసేపటికి ధర్మకర్తగారే బయటికి వచ్చాడు. ఆయనను చూడగానే బిచ్చగాడు, "కరుణించండి, బాబూ! బాధతో చచ్చిపోతున్నాను, నాయనా!" అని ఎలుగెత్తి ఏడవసాగాడు.

వాడి కాలు చూడగానే ధర్మకర్తకు గుండె కరిగిపోయింది. ఆయన తన భటులను పిలిచి, "పాపం, వీణ్ణి తీసుకుపోయి పడుకోబెట్టండి—నా పక్క మీదనే పడుకోబెట్టండి. నేను గట్టి వైద్యులను పిలిపిస్తాను. వాడికి కావలిసిన ఉపచా

25 ఏళ్ళనాటి చందమామ కథ

రాలు ఏ లోటూ రాకుండా చెయ్యండి,'' అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

ధర్మకర్తగారి భటులు బిచ్చగాణ్ణి తీసుకుపోయి ధర్మకర్తగారు స్వయంగా పడుకునే హంసతూలికాతల్పం మీద పడుకోబెట్టారు. మరి కొద్దిసేపట్లో ఇద్దరు వైద్యులు బిచ్చగాడి కాలు పరీక్షించ టానికీ, అవసరమైన చికిత్స చెయ్యటానికీ వచ్చారు. వాళ్ళు ఆ నగరానికంతటికీ పేరు మోసిన వ్రణవైద్యులు.

పండు కోసం పోతే చెట్టు విరిగి మీద పడ్డట్టయింది బిచ్చగాడికి. ధర్మకర్తగారు పెద్దగా ధర్మం చేసి పంపిస్తారనుకుంటే వాడి ప్రాణానికి ఒకరుకాదు, ఇద్దరు వైద్యులు దాపరించారు.

ఆ వైద్యులలో ఒకడు బిచ్చగాడి కాలు చూస్తూనే, "అబ్బో, చాలా ముదిరి పోయింది. కాలు తెగగొట్టాలిసిందే!" అన్నాడు.

బిచ్చగాడికి గుండె ఆగినంత పని అయింది. రెండో వైద్యుడు బిచ్చగాడి కాలును శ్రద్ధగా పరీక్షించాడు. "ఇది దొంగవాపు. ఈ బిచ్చగాళ్లు కొన్ని పసరులు పూసి ఇటువంటి రోగాలు సృష్టించగలరు. కొంతసేపటికి ఆ వాపు అదే పోతుంది. మందులూ మాకులూ అవసరం లేదు,'' అన్నాడాయన.

మొదటి వైద్యుడు కూడా బిచ్చగాడి కాలు పరీక్షించిన మీదట రోగం నిజం కాదని తెలిసిపోయింది.



వైద్యులిద్దరికీ కోపం వచ్చింది. "చికిత్స చేస్తే ధర్మకర్తగారు బోలెడంత డబ్బిచ్చేవాడు! దొంగవెధవ, మన నోట కరక్కాయకొట్టాడు! వీడి సంగతి ఆయనకు చెప్పేద్దాం!" అన్నాడు ఒక వైద్యుడు.

"అంతకంటే వీడికి నిజంగా రోగమేనని చెప్పి కాలు నరికేద్దాం! అట్లాగాని వీడికి తగిన శాస్తి జరగదు!" అన్నాడు రెండో వైద్యుడు.

బిచ్చగాడికి ప్రాణభయం పట్టుకుంది. వాడు పక్క మీద లేచి కూచుని, "బుద్ధి గడ్డి తిని, నాలుగు డబ్బుల కాశపడి, తప్పుడు పని చేసిన మాట నిజమేనయ్యా! నన్ను రక్షించండి! నా కాలు తెగగొట్టకండి. అందువల్ల మీకేం లాభం?" అని కాళ్ళావేళ్ళాపడి బతిమాలసాగాడు.

వైద్యులిద్దరూ కూడబలుక్కున్నారు. "ఇప్పుడు మాత్రం మించిపోయినదేమిటి? వాడి కాలు నయం చేసినట్టు నటించి, మన డబ్బు మనం పుచ్చుకుందాం," అని వారు నిశ్చయించుకున్నారు.

వాళ్ళు బిచ్చగాడితో, "ఒరే, నువు నోరు మెదిపావంటే, జాగ్రత్త! మేము చెప్పేదాకా ధర్మకర్తగారితో నీ కాలు నయం కాలేదనే చెప్పు. లేకపోతే ఆ కాలు నీకు దక్కదు, బాగా గుర్తుంచుకో!" అని భయపెట్టారు.

బిచ్చగాడు కడుపుకక్కుర్తి కోసం జనాన్ని మోసగించేవాడే అయినప్పటికీ,



వాడికి ఈ పేరుమోసిన వైద్యుల మోసం చూసి ఆశ్చర్యం కలిగింది. కాని వారికి ఉండే ధైర్యం తనకు లేనందున, వాడు ఆ వైద్యులు చెప్పిన ప్రకారమే చేయడానికి ఒప్పుకున్నాడు.

వైద్యులు ధర్మకర్తతో, "స్వామీ, ఈ దౌర్భాగ్యుడు చాలా అపాయస్థితిలో ఉన్నాడు. భగవదనుగ్రహం వల్ల వాడు మీ కళ్ళపడ్డాడు. మీరు మమ్మల్ని పిలిపించారు. వాడి కాలు నయం చేయటానికి మా శక్తి కొద్దీ ప్రయత్నిస్తాం. ఆ పైన భగవంతుడున్నాడు!" అని చెప్పారు.

వాళ్ళు రోజూ వచ్చి కాలుకట్లు విప్పి, మళ్ళీ కట్టిపోతున్నారు. వారాలూ, నెలలూ గడుస్తున్నాయి. ఎంతకీ కాలు నయం కాదు, చికిత్స పూర్తికాదు. బిచ్చగాడికి అన్నివిధాలా సుఖంగానే జరిగిపోతున్నది. కాని ఇంతకంటే స్వేచ్ఛగా వీథుల వెంబడి అడుక్కుతిన్న రోజులే వాడికి మంచివనిపించాయి.

వాడు వైద్యులను, "నా కాలు త్వరగా నయం చెయ్యండి, మీకు పుణ్యం ఉంటుంది!" అని ప్రార్థించసాగాడు.

మూడు నెలలు దొంగవైద్యం చేసిన మీదట, బిచ్చగాడి బాధ భరించలేక, వైద్యులు చికిత్స పూర్తి అయిందని ధర్మకర్తకు తెలియజేశారు. ఆయన చాలా సంతోషించి వైద్యులకు గొప్పగా బహుమానాలూ, డబ్బూ ఇచ్చాడు.

తరవాత ధర్మకర్త బిచ్చగాడితో, "ఏమిరా, నీ కాలు నయమయిందిగదా, ఏం పని చేస్తావు? ఎట్లా జీవిస్తావు?" అన్నాడు.

"బుద్ధి వచ్చింది, బాబూ! ఇక జన్మలో బిచ్చమెత్తను! అది తప్ప ఇంకే పని అయినా చేసుకుంటాను!" అన్నాడు బిచ్చగాడు.

వాడామాట ఎందుకన్నాడో ధర్మకర్తకు అర్థంకాలేదు గాని, ఆయన వాడికి తన వద్దనే ఉద్యోగం ఇచ్చి దగ్గర ఉంచుకున్నాడు.





# కపటయోగి

పూర్వం కురురాజ్యంలోని పాంచాల నగరానికి, రేణుకుడు రాజుగా వుండేవాడు. అదే కాలంలో హిమాలయ పర్వతాల్లో ఐదువందలమంది సాధువులకు గురువైన మహారక్షితుడు అనే తపస్వి వుండేవాడు.

ఒకప్పుడు మహారక్షితుడు శిష్యవర్గంతో దేశసంచారం చేస్తూ, పాంచాలనగరానికి వచ్చాడు. సాధువుల రాకకు రాజు చాలా సంతోషించి, మహారక్షితుడికి ఉచిత మర్యాదలు చేసి, ఉద్యానవనంలో సాధువులకు వసతి ఏర్పాటుచేశాడు.

వర్షరుతువు గడిచేవరకూ మహారక్షితుడు అక్కడే వుండి, రాజు వద్ద సెలవు పుచ్చుకుని, శిష్యులతో తిరిగి హిమాలయాలకు బయలుదేరాడు. మార్గంలో అందరూ ఒక చెట్టు నీడన కూర్చుని, రాజు తమకు చేసిన సత్కారం గురించి చెప్పుకోసాగారు.

మాటల సందర్భంలో రాజుకు సంతాన ప్రాప్తి వున్నదా లేదా అన్న ప్రసక్తి వచ్చింది. శిష్యగణంలో వున్న జ్యోతిష ప్రవీణులు చర్చలు ప్రారంభించారు. అంతా విన్న గురువు మహారక్షితుడు, "రాజు రేణుకుడికి దైవాంశగల కుమారుడు జన్మిస్తాడు," అన్నాడు.

మహారక్షితుడు వాక్శుద్ధి కలవాడని శిష్యులందరికీ తెలుసు. అందువల్ల వారు రాజుకు మేలు కలగబోతున్నదనుకున్నారు. వాళ్ళల్లో ఒకడికి దుర్బుద్ధి పుట్టింది. వాడు, తక్కిన వాళ్ళతో కొంచెం వెనకగా వస్తానని చెప్పి, అందరూ కనుచూపు మేరదాటిపోగానే, వెనుదిరిగి పాంచాలనగరం చేరాడు.

వాడు, రాజు దర్శనం చేసుకుని, "ఓయీ రాజా! మేమంతా హిమాలయాలకుపోతూ ఒకచోట విశ్రాంతి తీసుకుం

టున్న సమయంలో, నీవు మా తలపునకు వచ్చావు. రాజుకు వంశం నిలబడుతుందా లేదా అన్న ప్రశ్న వచ్చింది. మేము దివ్య దృష్టివల్ల, నీకు దైవాంశ సంభూతుడైన కుమారుడు కలుగుతాడని తెలుసుకుని, ఆ మాట చెప్పిపోయేందుకు వచ్చాము. ఇక పోయివస్తాం," అంటూ వెళ్లబోయాడు.

ఈ వార్త విని ఆనందభరితుడైన రాజు, యోగిని ఆపి, ''మహాత్మా, తమరు సామాన్యులు కారు, దివ్యచక్షులు! ఇక్కడే వుండిపొండి,'' అని కోరాడు.

దుష్టబుద్ధి అయిన యోగి అందుకు అంగీకరించాడు. అతడికి రాజు ఉద్యాన వనంలో అన్ని వసతులూ ఏర్పరచి, గురువులా అతణ్ణి సేవించసాగాడు. ఇక యీ కపటయోగి ఉద్యానవనంలో ఒక మూల కూరగాయలు కాయించి, వాటిని తోటమాలీల ద్వారా అమ్మించి, ధనం గడించసాగాడు.

ఈ సమయంలో బోధిసత్వుడు, రేణుక మహారాజుకు కుమారుడుగా జన్మించాడు. జాతకర్మలు చేయించి అతడికి సుమ నసుడు అని పేరు పెట్టారు.

సుమనసుడు ఏడేళ్ళవాడైవుండగా రాజు రేణుకుడికి సామంతరాజులతో యుద్ధం వచ్చింది. తండ్రి ఇంట లేనప్పుడు సుమనసుడు ఒకనాడు ఉద్యానవనం చూడబోయాడు. అక్కడ ఒక మూల కాషాయవస్త్రాలు ధరించిన యోగి మొక్కలకు పాదులు తీస్తూ, కూలివాడి కన్న



ఎక్కువగా కాయకష్టం చేస్తూండడం అతడి కంటబడింది.

సుమనసుడు కపటయోగిని గుర్తించి, అతడికి బుద్ధి చెప్పాలని, "ఒరే, తోట మాలీ!" అంటూ కేక పెట్టాడు.

దివ్యచక్షువుగా పేరుమోసిన కపట యోగి యీ పిలుపు వింటూనే అదిరి పడ్డాడు. తన రహస్యం రాజకుమారుడు గ్రహించాడని తెలుసుకున్నాడు. అతణ్ణి ఎలా అయినా కడతేర్చాలని నిశ్చయించు కుని, ఒక వ్యూహం పన్నాడు.

సరీగా, రాజు తిరిగి వచ్చే సమయానికి కపటయోగి తన కమండలాన్నీ, పీఠాన్నీ ముక్కలు చేశాడు. ఆశ్రమం చుట్టూ గడ్డీ గాదం విరజిమ్మాడు. తరవాత ఒళ్ళంతా నూనె పూసుకుని, ఆశ్రమంలో ఒక మూల మూలుగుతూ పడుకున్నాడు.

రాజు తన గురువైన దివ్యచక్షుణ్ణి చూడ బోయాడు. అతడికి ఆశ్రమ పరిసరాలు అశుభ్రంగా కనిపించాయి.

"మహాత్మా, ఏం జరిగింది?" అని అడిగాడు రాజు చేతులు జోడించి.

"ఇదంతా నీ కొడుకు చేసిన పని!" అంటూ కపటయోగి, సుమనసుడు తనకు చేసిన అవమానం గురించి చెప్పాడు.

రాజు ఉగ్రుడైపోయి, తలారులను పిలిచి, "సుమనసుడి తల నరికి నా దగ్గి రకు తీసుకురండి!" అని ఆజ్ఞాపించాడు.

తలారులు పోయి, తల్లి దగ్గిర కూర్చుని వున్న సుమనసుడికి సంగతి చెప్పారు.



సుమనసుడు తండ్రి దగ్గరకు వచ్చి, "నాన్నగారూ, మహాత్ముడు, పవిత్రుడు అని నువ్వు పూజించే ఆ కపటయోగి చేస్తున్నదేమిటో ద్వారపాలకుల్ని అడిగి చూడు, తెలుస్తుంది," అన్నాడు.

రాజు ప్రాసాదపు నాలుగు ద్వారాలనూ కాపలా కాసేవాళ్ళను పిలిపించాడు. వాళ్ళు, రాజుతో దాచకుండా యోగి కూర గాయలు పండించి అమ్మడం గురించి చెప్పారు.

రాజు ఆశ్రమంలో వెదికించగా, కపట యోగి దాచిన ధనం బయటపడింది.

రాజు తన తప్పిదానికి చాలా విచా రించి, కొడుకుతో, "నాయనా, నా తొందర పాటు మన్నించు. ఇక, ఈ రాజ్యాన్ని నువే ఏలుకో," అన్నాడు.

అందుకు సుమనసుడు ఒప్పుకోక, "మహిమగల మూలిక ఎంత పని చేస్తుందో, నోటి వెంట వెడలే మాట కూడా అంత పని చేస్తుంది. నీ నోటి వెంట వెడలినవి దుష్టవాక్కులు! నీ ఆజ్ఞ ప్రకారం, నా తల్లి దగ్గర కూర్చుని వున్న నన్ను తలారులు వధ్యశిల వద్దకు తీసుకు పోబోయారు. నేనిప్పుడే, నీ రాజ్యం విడిచి పోతున్నాను," అన్నాడు.

సుమనసుడి మనసు మార్చవలసిందిగా రాజు, రాణిని కోరాడు. కాని ధర్మచింత గల రాణి ఆ మాట పాటించక కొడుకును దీవిస్తూ, "నాయనా! నువు ధర్మ మూర్తివి. పవిత్రజీవనం గడుపుతూ. తరించు," అన్నది.

సుమనసుడు హిమాలయప్రాంతం చేరి, అక్కడ విశ్వకర్మ నిర్మించి వుంచిన కుటీరంలో తపస్సుచేస్తూ కాలంగడిపాడు.

రాజు రేణుకుడు కపటయోగికి మరణ దండన విధించాడు. ఆనాటి నుంచీ యోగులకు రాజ్యంలో ఎవరూ ఆశ్రయం యివ్వవద్దని శాసనం చేశాడు.

ఈ విధంగా, దుష్టబుద్ధి అయిన ఒక్క కపటయోగి కారణంగా, యోగులందరికీ తీరని అపకీర్తి కలిగి, కురురాజ్యంలో వారికి ప్రజాదరణ లేకుండా పోయింది.





# శిలాదిత్యుడు

ఒక మహా సామ్రాజ్యాన్ని స్థాపించాలనే కాంక్ష గల శిలాదిత్యుడు, 7-వ శతాబ్దంలో కాశ్మీరును పాలిస్తూండే వాడు. అతడు యుద్ధప్రియుడు. గోబీ ఎడారి ప్రాంతాన గల ఒక చిన్న రాజ్యాన్ని జయించేందుకు సైన్యంతో బయలుదేరాడు.

దారిలో ఒక చోట, కొత్తవాడొకడు పరిగెత్తుకుంటూ వచ్చి, శిలాదిత్యుడు ఎక్కివున్న గుర్రం ముందు సాష్టాంగపడ్డాడు. రాజు గుర్రాన్ని ఆపాడు. ఆ కొత్తవాడు శిలాదిత్యుడు దాడి చేయనున్న రాజ్యపు మంత్రి అని చారులు గుర్తించాడు.





రాజు ప్రశ్నించగా, శత్రుదేశపు మంత్రి తన కథ అంటూ యిలా చెప్పాడు: అతడు, తన రాజుకు మహాబల సంపన్నుడైన శిలాదిత్యుడికి లొంగిపోవలసిందిగా సలహా యిచ్చాడు. కాని, రాజు శిలాదిత్యుణ్ణి దూషించి, అతణ్ణి కొరడాలతో కొట్టించాడు.



జరిగిన అవమానానికి సరైన ప్రతీకారం చేస్తానని, శిలాదిత్యుడు మంత్రికి వాగ్దానం చేశాడు. అప్పుడు మంత్రి, "మహారాజా, మీరు సైన్యంతో మామూలు మార్గాన ప్రయాణిస్తే, మా రాజ్యం చేరేందుకు మూడు నెలలు పడుతుంది. ఎడారి నుంచి ఒక దగ్గిర దారి నాకు తెలుసు. ఆ దారిన వెళితే, మా రాజ్యాన్ని రెండు వారాలలో చేర వచ్చు," అన్నాడు.

శిలాదిత్యుడు, యీ దగ్గిర దారిన ప్రయాణించేందుకు నిశ్చయించాడు. ఎడారిలో నీళ్ళు దొరకవు. మంత్రి సలహా ప్రకారం రాజు సైన్యానికి రెండు వారాలకు సరిపడా నీటిని జాగ్రత్త పరిపించాడు. మంత్రి దారి తీయగా సైన్యం ఎడారిలో ప్రవేశించింది.





ఎడారి ప్రయాణం సైనికులకు చాలా బాధాకరంగా పరిణమించింది. ఎక్కడా కొద్దిపాటి నీడనిచ్చే చెట్ల లాంటివి కూడా లేవు. ఈ విధంగా పదిహేను రోజులపాటు ఎడారి ప్రయాణం జరిగే సరికి, వెంట తెచ్చిన నీరంతా అయి పోయింది. కొన్ని గుర్రాలూ, ఏను గులూ మరణించినై.



మంత్రి మాత్రం, మనం చేరవలసిన ప్రదేశం బహు దాపులనే వున్నదంటూ ధైర్యం చెబుతున్నాడు. కాని, ఎక్కడా జననివాసాలున్న సూచనలే లేవు. క్రమంగా వడదెబ్బకు సైనికులు మరణించసాగారు. దళనాయకులు రాజుతో, యిక యీ ఎడారి ప్రయాణం అందరి చావుకూ కారణం అవుతుందని చెప్పారు.

మంత్రి మాటలకు విసిగిపోయిన శిలాదిత్యుడు; అతణ్ణి నిగ్గదీసి, "మనం ఎప్పుడు మీ రాజ్య సరిహద్దులు చేరతాం?" అని అడిగాడు. మంత్రి తొణక్కుండా, "మహారాజా, మీరు ససైన్యంగా త్వరలోనే మృత్యులోకం చేరబోతున్నారు. కావాలంటే నాకు మరణదండన విధించండి. కాని, మీరు యీ భయంకరమైన ఎడారిలో ముందుకు పోయినా లేక వెనుదిరిగినా, చావుమాత్రం తప్పదు," అన్నాడు.





తరవాత అతడు రాజుతో, తాను కావాలనే సైన్యాన్ని నీరు లభ్యంకాని ఎడారి మార్గం పట్టించానని ఒప్పుకున్నాడు. తమ చిన్న రాజ్యాన్ని కాపాడేందుకు ఆత్మార్పణకు సిద్ధపడ్డానన్నాడు. శిలాదిత్యుణ్ణి నమ్మించేందుకు, తన మిత్రులచేత కొరడా దెబ్బలు తిన్నానని చెప్పి, "మహారాజా, నా తల నరకండి!" అంటూ మోకరిల్లి, తలవంచాడు.



శిలాదిత్యుడు నిరాశచెందక, నీటికోసం వెతకవలసిందిగా సైనికులను ఆజ్ఞాపించాడు. ఆయన వెంట ఒక జలవేత్త వున్నాడు. అతడు చెప్పిన ప్రదేశాన సైనికులు ఎంత తవ్వినా నీటిచుక్క దొరకలేదు.

రాజాజ్ఞమేరకు సైనికులు మరింత లోతుగా తవ్వారు. హఠాత్తుగా నీటిబుగ్గ బయటపడింది. సైనికుల ఆనందోత్సాహాలు అంతాయింతా కాదు. శిలాదిత్యుడు తిరుగుప్రయాణానికి అవసరం అయిన నీటిని పెద్ద పెద్ద పాత్రల్లో నిలవ చేయించాడు.





తరవాత ఆయన మంత్రితో, "ఈ ఎడారిలో నువ్వూ దాహబాధతో మాతోపాటు మరణించి వుండేవాడివి గనకే, నేను నిన్ను చంపలేదు. కాని, యిప్పుడు ప్రకృతి మా పట్ల దయచూపింది. ఆ కారణంగా నేనూ, నీ పట్ల దయచూపదలిచాను. నీ దేశభక్తి మెచ్చదగింది!" అన్నాడు.

# ఆపద్బాంధవుడు

చిల్లర వర్తకుడు శేషయ్య పట్నంలో పని ముగించుకుని, తన రెండెడ్ల బండి మీద స్వగ్రామం బయలుదేరాడు. బాట ఎగుడు దిగుడులు లేకుండా చక్కగా వున్నది. ఏ కుదుపులూ లేకుండా హాయిగా సాగిపోతున్న బండి, హఠాత్తుగా ఒకచోట బురదలో కూరుకుపోయింది.

బండి నిండా పచారీ సామానులుండడంతో శేషయ్య ఎంత ప్రయత్నించీ బండిని బురద లోంచి బయటికి లాగలేకపోయాడు. బాట పక్కనే ఒక గుడిసె వున్నది. శేషయ్య అక్కడికి పోయి, గుడిసెలో వున్న వాడికి సంగతి చెప్పి, సాయం చెయ్యమన్నాడు.

వాడు పదేళ్ల కుర్రవాడితో గుడిసెలోంచి బయటికి వచ్చి, క్షణాల మీద బురదలోంచి బండి చక్రాన్ని బయటికి లాగి, చేతులు దులుపుకుంటూ నిలబడ్డాడు.

శేషయ్య ఎంతో కృతజ్ఞతగా అతడి చేతిలో ఒక వరహా పెడుతూ, "ఈ విధంగా రాత్రిం బవళ్ళు సాయం చేస్తూ, నువ్వు చాలా సంపాదిస్తూండాలి!" అన్నాడు.

"మా నాన్నకు రాత్రిళ్ళు తీరికుండదు, బాబూ! రాత్రంతా, చెరువు నుంచి నీళ్ళు తెచ్చి, బాటంతా బురద చేయాలి గదా," అన్నాడు గుడిసెవాడి చిన్న కొడుకు.

శేషయ్యకు మతిపోయినంత పనైంది. —కోనే నాగ వెంకట ఆంజనేయులు






# గండం గడిచింది!

పుష్పగిరి, చందనగిరి ఇరుగు పొరుగు రాజ్యాలు. రెండు రాజ్యాల మధ్య స్నేహం వున్నది. ఒకసారి పుష్పగిరి రాజైన జయకేతుడు, చందనగిరి రాజైన సింహకేతుణ్ణి తన రాజ్యాన్ని సందర్శించవలసిందిగా కోరాడు. సింహకేతుడు ఆ కోరికను మన్నించి, పుష్పగిరికి వచ్చాడు.

సింహకేతుడికి పుష్పగిరిలో ఘనమైన స్వాగతంతోపాటు, చక్కటి అతిథిమర్యాదలు జరిగాయి. మూడు రోజులపాటు సింహకేతుడు పుష్పగిరిలో వున్నాడు.

మూడవ రోజు మధ్యాహ్నం భోజనాలయిన పిమ్మట సరదాగా జయకేతుడూ, సింహకేతుడూ చదరంగం ఆడటం ప్రారంభించారు.

ఎన్ని ఆటలు ఆడినప్పటికీ ఒక్క ఆట కూడా సింహకేతుడు గెలవలేకపోయాడు. అలా జరగటం అతనికి చాలా చిన్నతనంగా తోచింది. సహజంగానే సింహకేతుడు అహంభావి. చిన్న ఓటమిని కూడా అతడు సహించలేడు.

సింహకేతుడు తిరిగి తన రాజ్యానికి వెళ్ళిపోయి, వారం తిరక్కుండానే, సైన్యంతో పెద్ద పెట్టున పుష్పగిరిపై దండయాత్ర చేసి విజయం సాధించాడు, అప్పటికిగాని అతడిలో కలిగిన అలజడి తగ్గలేదు.

పుష్పగిరి, చందనగిరి రాజ్యాలకు పది ఆమడల దూరంలో కనకగిరి అనే రాజ్యం వున్నది. దానికి రాజు విజయవల్లభుడు. అతని ఏక పుత్రిక మణివల్లభి సాటిలేని అందగత్తెగా పేరు గాంచింది.

ఆమెకు యుక్తవయసు వచ్చాక విజయవల్లభుడు స్వయంవరానికి ఏర్పాట్లు చేయసాగాడు.

గంగిశెట్టి శివకుమార్

ఆహ్వానాలు పంపేందుకు రాజుల పేర్ల జాబితా తయారు కాసాగింది. అక్కడే విజయవల్లభుడికి పెద్ద చిక్కు వచ్చి పడింది. చందనగిరి రాజు సింహకేతుడికి ఆహ్వానం పంపటమా? మానటమా?

పంపినట్టయితే అతను స్వయంవరానికి వస్తాడు. అలా వచ్చినపుడు స్వయంవరంలో రాకుమార్తె అతన్నిగాక మరొకరిని వరించిన పక్షంలో, అతనా ఓటమిని సహించలేడు. ఏదో ఉపద్రవం తెచ్చి పెడతాడు!

అలా గాక ఆహ్వానం పంపకపోయినట్లయితే, అతనికి తనను నిర్లక్ష్యం చేశారని కోపం రావచ్చు. అలానూ ప్రమాదం తప్పదు. ఎలా ఈ చిక్కుముడి వీడి గండం గడుస్తుందా? అని రాజు మథనపడసాగాడు.

రాజుగారిని ఏదో సమస్య వేధిస్తున్నట్టు మంత్రి పసిగట్టాడు. రాజు సమస్య అంతా మంత్రికి చెప్పాడు. మంత్రి కొద్దిసేపు ఆలోచించిన మీదట రాజుతో, "ఈ విషయమై మీరిక నిశ్చింతగా వుండండి. జరగవలసినదంతా సక్రమంగా జరిగేటట్టు నేను చూస్తాను." అన్నాడు నిబ్బరంగా.

రాజులందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి, సింహకేతుడితో సహా. స్వయంవరం రోజున అందరు రాజులతోపాటు సింహకేతుడు



కూడా దర్పంగా వచ్చి సభలో కూర్చున్నాడు.

వరమాల తీసుకొని, రాకుమారి మణివల్లభి బయలుదేరి, రత్నగిరి యువరాజైన చంద్రాంగుడి మెడలో ఆ మాలను వేసింది.

సభలో హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. సింహకేతుడి ముఖంలో రంగులు మారసాగాయి.

హర్షధ్వానాల తర్వాత సభలో నిశ్శబ్దం ఆవరించింది. మంత్రి లేచి, సభికులతో, "స్వయంవరానికి విచ్చేసి, కార్యక్రమం ప్రశాంతంగా జరిగేందుకు తోడ్పడ్డ రాకుమారులందరకు కృతజ్ఞతలు. స్వయం

వరాలు చాలామట్టుకు గొడవలతో ముగి సేవే! ఆహ్వానితులు ఎక్కువ సంఖ్యలో వుంటారు. రాకుమారి ఒక్కరినే వరించ వలసి వుంటుంది. మిగిలినవారికి నిరాశ తప్పనిసరి. ఆ నిరాశను మిగిలినవారు సహృదయంతో భరించాలి.

స్వయంవరానికి ఏర్పాట్లు ప్రారంభిం చిన నాటి నుంచీ, ఏదైనా గొడవ జరుగు తుందేమోనన్న భయం మాకు వున్నది. మాకేకాదు, మా మిత్రదేశమైన చందనగిరి రాజు సింహకేతునికి కూడా ఆ అను మానమే కలిగి, ఆయన అవసరమయితే మాకు తోడ్పడేందుకు తగిన ఏర్పాట్లతో వచ్చారు. అంతేగాని ఆయన వచ్చింది స్వయంవరంలో పాల్గొనేటందుకుగాదు. మా కంటే నాలుగురెట్లు భూభాగానికి అధి పతి అయిన ఆయనకు మాతో వియ్య మందవలసిన అవసరం ఏమీ లేదు. ఎందుకనో ఈ విషయాన్ని ఆయన మాకు కూడా తెలియపరచలేదు. చారుల ద్వారా మాకీ విషయం తెలిసింది. మేము కోర కుండానే మాకు సహాయపడాలని వచ్చిన ఆయనకు ఈ సందర్భంలో ప్రత్యేక కృత జ్ఞతలు,'' అంటూ ముగించాడు.

మంత్రి మాటలు పూర్తవగానే సభికులు సింహకేతుడికి జయజయ ధ్వానాలు పలి కారు. సింహకేతుడికి అంతా అగమ్యగోచ రంగా తోచింది. మంత్రి చెప్పిన మాటలు నిజం కావని అంటే, తాను రాకుమారి చేత తిరస్కరింపబడినవాడుగా నిరూపణ అవుతాడు. ఊరుకుంటే కనీసం మంత్రి మెప్పు అయినా మిగులుతుంది! తన దర్పం చెక్కుచెదరదు!

ఇలా ఆలోచించిన మీదట సభికుల జేజేలకు హుందాగా తల వూపుతూ కూర్చుండిపోయాడు సింహకేతుడు.

తర్వాత విజయవల్లభుడి చేత చక్కటి మర్యాదలు పొంది, సంతోషంగా తన నగరానికి చేరాడు.

గండం నుంచి గట్టెక్కించినందుకు మంత్రిని వింతగానే అభినందించాడు విజయవల్లభుడు.



# ఆదా మనుషులు

ఉప్పంగి గ్రామంలో బాగా డబ్బున్న ఒక పిసినిగొట్టు, అన్నంగి గ్రామంలో బంధువుల ఇంట పెళ్ళికి తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చింది. ఈ రెండు గ్రామాల మధ్య దూరం నాలుగు కోసులు. బాడుగ బళ్ళున్నా, డబ్బు ఆదా అవుతుందని పిసినిగొట్టు కాలినడకన బయలుదేరాడు.

దారిలో అతడికి మరొకడు తారసపడి, మాటలు కలిపి, "ఇంత ఎండలో నడవడం శ్రమ కదా ? బాడుగ బండి కట్టించుకుంటే సరిపోయేది," అన్నాడు.

"శ్రమ మాట సరే, డబ్బు ఖర్చు మాటేమిటి ? అన్నిటికన్న డబ్బు ఆదా చేయడం ముఖ్యం," అన్నాడు పిసినిగొట్టు.

"ఆ మాటా నిజమే! నాకు దమ్మిడీ ఖర్చు పెట్టడమంటే ప్రాణం లబలబలాడిపోతుంది," అంటూ కొత్తవాడు బొడ్లో నుంచి చిన్న కత్తి బయటకు తీసి, "వారం రోజుల క్రితం, చిన్న మాటతో అయిపోయే దానికి, నీలాంటి వాడిమీద దీన్ని ప్రయోగించాను. మళ్ళీ సానబట్టించేందుకు పావలా ఖర్చయింది. ఏదీ, నీ జేబులో వున్న డబ్బూ, వేలి ఉంగరం యిటివ్వు," అన్నాడు.

ఈ దొంగ తనలాంటి ఆదా మనిషే అని గ్రహించిన పిసినిగొట్టు, మారు పలక్కుండా డబ్బూ, ఉంగరం అతడికిచ్చేశాడు.

—రేవా నాగేశ్వరరావు





# దయగల దయ్యాలు

పని వుండి పట్నం వెళ్ళిన శౌరి, సూర్యాస్తమయం వేళ పని ముగించుకుని, హడావిడిగా తన ఊరుకు బయలుదేరాడు. కొంచెం చురుగ్గా నడిస్తే, అర్ధరాత్రికి ముందే ఇల్లు చేరవచ్చునని అతడి ఆశ. కాని, దారిలో వున్న చిట్టడవి చేరేసరికి పెద్ద పెట్టున వర్షం ప్రారంభమైంది. అతడు వర్షం తగ్గేవరకూ ఒక చెట్టు కింద వణుకుతూ నిలబడి, తిరిగి నడకసాగించాడు. అయినా, అర్ధరాత్రి సమయానికి సగం అడవే దాటగలిగాడు.

చలి విపరీతంగా వున్నది. కొంచెం దూరం నుంచి తోడేళ్ల అరుపులూ, నక్కల ఊళలూ వినిపించసాగాయి. తెల్లవారే వరకూ భద్రమైన చోటు చూసుకుని తల దాచుకోవడం మంచిదని తోచింది, శౌరికి.

అదృష్టవశాత్తూ, దారికి కొంచెం పెడగా వున్న పెద్ద మర్రిచెట్టు శౌరి కంటబడింది. ఆ చెట్టు బోదెలో మనిషి పట్టగలంత పెద్ద తొర్ర వున్నది. అందులో వెచ్చగా వుండడంతో, శౌరి లోపలికి పోయి కూర్చున్నాడు. వెంటనే అతడికి కునుకు పట్టింది.

నెత్తి మీద ఏవో గలగలమంటూ పడుతూంటే, ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు, శౌరి. మూడు దయ్యాలు దోసిళ్లతో డబ్బు ఆ తొర్రలోకి గుమ్మరిస్తున్నవి. తొర్రలోంచి తల బైటికి పెట్టి పిశాచాలను చూసిన శౌరి కెవ్వుమన్నాడు.

"భయపడకు! మమ్మల్ని చూస్తూనే ఎందుకా పిచ్చి కేకలు?" అన్నవి దయ్యాలు.

శౌరి ఎలాగో గొంతు పెగుల్చుకుని, "దయ్యాలు కనక!" అన్నాడు.

"దయ్యాలన్నీ ఒకేలా వుండవు. వాటిల్లోనూ దయగలవి వున్నాయి. మేం

మాచిరాజు కామేశ్వరరావు

ఆ కోవకు చెందినవాళ్ళం," అన్నదొక దయ్యం.

"ఆ మాటకొస్తే, యీ కాలం మనుషులు దయ్యాలకెందునా తీసిపోరు. అయినా, వాళ్ళకు దయ్యాలంటే చెడ్డవనీ, హాని కలిగిస్తవనీ ఒక దురభిప్రాయం ఏర్పడిపోయింది. దాన్ని పోగొట్టేందుకు, మనుషులతో స్నేహం చేయాలని మా కోరిక," అన్నది మరొక దయ్యం.

"అందుకే, యీ తొర్రలో డబ్బు దాస్తున్నాం. మనిషికి డబ్బంటే మహా ఆశగదా! నువ్వు మంచి సమయంలోనే, మా కంటపడ్డావు. ఈ డబ్బు, మీ ఊరి వాళ్ళందరికీ పంచి, వాళ్ళతో మాకు స్నేహం కుదిరేలా చెయ్యి," అన్నది మూడో దయ్యం.

మూగిలా అంతా వింటూ తలాడిస్తున్న శౌరిని, "బాబ్బాబు, యీ పని చేసి పుణ్యం కట్టుకో!" అంటూ మూడు దయ్యాలూ బ్రతిమలాడడం ప్రారంభించాయి.

"అవును, దయ్యాల పేరు చెబితేనే పిల్లలు దడుచుకుంటారు. వాళ్ళకు యీ డబ్బు, మీ నుంచి బహుమతిగా వచ్చిందని చెప్పి, దయ్యాలంటే వాళ్ళకున్న భయం పోగొడతాను," అంటూ శౌరి డబ్బంతా మూట గట్టుకున్నాడు.



"బాబూ, ఆ పని చేస్తివా, మేం బతికి పోతాం. రేపు రాత్రికి మళ్ళీ యిక్కడకిరా," అంటూ దయ్యాలు అదృశ్యమై పోయాయి.

ఆ సరికి తెల్లవారవస్తున్నది. శౌరి పట్టరాని ఆనందంతో, డబ్బుమూట భుజాన వేసుకుని ఇల్లు చేరాడు.

"పట్నంలో పనయిందా, మళ్ళీ వెళ్ళాలా? అదేమిటి, భుజాన ఆ మోత బరువు?" అని అడిగింది శౌరి భార్య భాగ్యం, భర్తను చూస్తూనే.

"భుజాన భాగ్యం వున్నదే, వెర్రిదానా. ఇక మనం పట్నంలో కాపరం పెట్టి, ఒక వెలుగు వెలగడమే తరువాయి!" అంటూ



డబ్బు నేల మీద గుమ్మరించి, జరిగిందంతా భార్యకు చెప్పాడు, శౌరి.

"మీ తెలివి తెల్లవారినట్టుంది. ఈ కాస్త డబ్బుతో పట్నంలో కాపరం పెట్టడమా? ఎలాగూ దయ్యాలు మళ్ళీ రమ్మన్నాయి గదా, పోయి మరి కాస్త డబ్బు పట్టుకురండి," అంటూ, అందుకు మార్గం కూడా చెప్పింది, భాగ్యం.

మర్నాటి రాత్రి అదే మర్రిచెట్టు దగ్గిర దయ్యాలు, శౌరి కోసం ఎదురు చూస్తున్నాయి. అవి శౌరి తమను సమీపిస్తూండగానే, "ఆఁ, వచ్చావా! మేం యిచ్చిన డబ్బు తీసుకుని పిల్లలేమన్నారు?" అని ఆత్రంగా అడిగినై.

"తెగ మురిసిపోయారు. దయ్యం బాబాయిలను చూపించమని ఒకటే పోరు!" అన్నాడు శౌరి.

"ఇకనేం! అయితే పద," అంటూ పొంగిపోయాయి దయ్యాలు.

"కొంచెం నిదానించండి. పిల్లలు సంతోషపడి లాభం లేదు. పెద్దవాళ్లేగదా, వాళ్ళకు దయ్యాలంటే చెడ్డవని, నూరిపోసేది? కనక, మనం వాళ్ళకూ్కడా కొంత డబ్బిచ్చి, మంచి చేసుకోవాలి. ఔనన్నట్టు, మీరు చెప్పేదాకా నేను గమనించనేలేదు, నిజంగా మనిషికి డబ్బంటే మహచెడ్డ ఆశ!" అన్నాడు శౌరి.

దయ్యాలు పెద్దవాళ్ళకోసమని శౌరికి మరి కొంత డబ్బు యిచ్చినై.

శౌరి భార్య భర్త తెచ్చిన డబ్బు చూసి, "ఇవేవో వెర్రి దయ్యాల్లా వున్నాయి. అయినా, మరి కొంత డబ్బు గుంజి, వాటిని మనం శాశ్వతంగా వదిలించుకోవాలి. అందుకు ఒక రాత్రి ఊరి జనాన్ని రచ్చబండ దగ్గిర సమావేశపరుస్తానని చెప్పి, దయ్యాలను వాళ్ళతో స్నేహం కలపమను. అవి సరేనంటే, యిలా చెయ్యి," అని, ఆ చేయవలసినదేమిటో భర్తకు చెప్పింది.

శౌరి భార్య తెలివితేటల్ని మెచ్చుకుని, ఆ రాత్రి దయ్యాలతో, "మీరిచ్చిన డబ్బు

తీసుకుని పెద్దవాళ్ళు చాలా సంతోషించారు. కాని, వాళ్ళల్లో బాగా మూఢ నమ్మకాలున్న ఆడవాళ్ళు అంతగా తృప్తి పడినట్టులేదు. వాళ్లనూ తృప్తిపరచాలి,'' అంటూ దయ్యాల నుంచి మరి కొంత డబ్బు తీసుకుని, మర్నాటి రాత్రి వాటిని ఊరి రచ్చబండ దగ్గరకు వచ్చెయ్యమన్నాడు.

ఆ పగలు శౌరి ఊరివాళ్ళతో, ''ఈ రాత్రి మొదటి జామున దయ్యాలు రచ్చబండ దగ్గరకు వస్తాయి. కళ్ళారా వాటిని చూడాలని కోర్కె వున్నవాళ్ళంతా రండి '' అని చెప్పాడు.

జనం కుతూహలం కొద్దీ పెందరాళే భోజనాలు చేసి, జాముర్రాతి కాగానే రచ్చబండ దగ్గిర చేరారు. శౌరి వాళ్ళతో, ''అంతా ఒకే ఊరువాళ్ళం గనక నిజం చెప్పేస్తున్నాను. నాకు యీ మధ్య ఒక దూరపు బంధువు ఆస్తి—దాచడం ఎందుకు? చాలా పెద్ద మొత్తం సంక్రమించింది. అందులో కొంత ఖర్చు చేసి మన ఊళ్ళో ఒక ఉచిత వైద్యశాల కట్టిద్దామనుకున్నాను. కాని, రాత్రి నిద్రలో వుండగా మూడు దయ్యాలు నన్ను తట్టి లేపి, అలా వైద్యశాల కట్టించవద్దని గట్టిగా హెచ్చరించాయి. ఈ మధ్య వాళ్ళ దిక్కుమాలిన లోకానికి వచ్చేవాళ్ళ సంఖ్య బాగా తగ్గిపోయిందట. ఈ రాత్రి మన ఊరు వచ్చి కొందర్ని తమ వెంట తీసుకుపోతాయట. మీరంతా ధైర్యంగా వుండి,



అ దయ్యాలకు తగిన శాస్తి చేయాలి,'' అని చెప్పాడు.

ఒక పావుగంట గడిచేలోపల మూడు దయ్యాలూ ఆనందంగా, నవ్వు మొహాలతో జనం దగ్గిరకు వచ్చాయి. వాటిని చూస్తూనే కొందరు పారిపోయారు. ధైర్యవంతులు నిలబడి వాటి మీద రాళ్ళూ, చెప్పులూ విసరడం ప్రారంభించారు.

మూడు దయ్యాలూ చేతులు జోడించి, ''అయ్యలారా! తొందరపడకండి. మేం యిక్కడికి వచ్చింది, మీకు హాని చేసేందుకు్కాదు; స్నేహం కోరి,'' అన్నవి.

అయినా జనం వాటి మీద చెప్పులూ, రాళ్ళూ విసరడం మానలేదు. దయ్యాలు పూర్తిగా ఆశాభంగం చెంది, అక్కణ్ణించి బయలుదేరాయి. శౌరి వాటిని కొంత దూరం పోయాక కలుసుకుని, ''చూశారా, మనుషులు ఎంత స్వార్థపరులో? వాళ్ళకు మీ డబ్బు పనికివచ్చిందిగాని, స్నేహం పనికిరాలేదు. నమ్మకద్రోహులు!'' అన్నాడు ఆవేశం నటిస్తూ.

దయ్యాలు ఎంతో శాంతంగా, ''నువ్వు మనిషివే అన్న సంగతి మరిచిపోకు! ఇది మాకు జన్మజన్మాలకూ గుర్తుండే అనుభవం,'' అంటూ మాయమై పోయాయి.

''పీడా విరగడైంది!'' అని పైకే అనేసి, మహదానందంగా శౌరి ఇంటిదారి పట్టాడు.

అతడు ఇల్లు చేరి, అక్కడి పరిస్థితి చూసి గుడ్లు తేలవేశాడు. ఊరి జనంతో తనకు ఆస్తి బాగా కలిసిందని చెప్పడం విన్న దొంగలు, అతడి ఇంట జొరబడ్డారు. వాళ్ళు శౌరి భార్యను స్తంభానికి కట్టేసి, దయ్యాలిచ్చిన డబ్బుతోపాటు, అతడు కష్టపడి కూడబెట్టినది కూడా దోచుకున్నారు.

శౌరి, భార్య కట్లు విప్పుతూ, పశ్చాత్తాప పడుతున్నవాడిలా, ''మనుషుల్ని మోసగించినా, దయ్యాల్ని మోసగించినా, మోసం మోసమే! దానికి ప్రాయశ్చిత్తం తప్పదు,'' అన్నాడు.





# తొలగిన వైరం

ఎంతో సఖ్యంగా వుండే సప్తగిరి, హిమగిరి రాజ్యాలకు సరిహద్దుల్లో నివసించే ప్రజల మధ్య జరిగిన ఒక కొట్లాట కారణంగా బద్ధశత్రుత్వం ఏర్పడింది. రెండు రాజ్యాల మధ్యా రాకపోకలు రద్దయాయి.

సప్తగిరిని అమరేంద్రుడు, హిమగిరిని విజయభూషణుడు పరిపాలిస్తున్నారు. ఈ రాజుల శత్రుత్వకారణంగా యిరుకున పడ్డ దేశం, కర్పూరదేశం. ఆ దేశాన్ని మణికంఠుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు.

కర్పూరదేశం వైశాల్యంలో సప్తగిరి, హిమగిరి రాజ్యాలకన్నా పెద్దది. సైనిక బలంలో, ఆ చుట్టుపక్కల గల రాజ్యాలు కర్పూరదేశానికి సాటిరావు. అయినా రాజు మణికంఠుడు రాజ్యకాంక్ష లేనివాడనీ, శాంతికాముడనీ పేరు పొందాడు.

ఇతర రాజ్యాల నుంచి కర్పూరదేశానికి లభ్యమయే చాలా నిత్యావసర వస్తువుల రవాణా సప్తగిరి, హిమగిరి రాజ్యాల ద్వారా జరగవలసి వున్నది. ఇప్పుడు వాటి రవాణా ఆగిపోయింది.

మణికంఠుడు యీ విషమపరిస్థితి నుంచి బయటపడేందుకు మార్గాల కోసం చాలా ఆలోచించాడు. యుద్ధం చేసి ఆ రెండు రాజ్యాలనూ తన అధీనంలోకి తెచ్చుకోవాలన్న ఆలోచన కలిగినప్పటికీ, అనవసర ప్రాణనష్టం కలిగించడం అతడికి యిష్టం లేదు.

ఈ సమయంలో మంత్రి వీరసేనుడు పరిస్థితి గ్రహించి, మణికంఠుడికి ఒక ఉపాయం చెప్పాడు. ఆయన అందుకు అంగీకరించాడు. ఆ మర్నాటికల్లా సప్తగిరి, హిమగిరి రాజులకు, మణికంఠుడి దూతల ద్వారా వర్తమానాలు అందాయి. కర్పూరదేశం ఫలానా రోజున సప్తగిరి మీద దాడి చేయబోతున్నట్టూ, ఆ రాజ్యం

స్వాధీనం కాగానే, హిమగిరిని ముట్టడించ నున్నట్టూ, ఆ వర్తమానాల సారాంశం.

శాంతికాముడని పేరు పొందిన మణికంఠుడి నుంచి యీ వర్తమానాలు రాగానే సప్తగిరి రాజు అమరేంద్రుడూ, హిమగిరి రాజు విజయభూషణుడూ ఆశ్చర్యపోయారు. తమ రాజ్యాల మధ్య వున్న శత్రుత్వం ఆసరాగా తీసుకుని మణికంఠుడు, వాటిని ఆక్రమించ చూస్తున్నాడని వాళ్ళు భావించారు.

వెంటనే ఆ ఇద్దరు రాజుల మధ్యా సంప్రతింపులు ప్రారంభమయినై. రెండు రాజ్యాలూ శత్రుత్వం మాని, ఐక్యంగా నిలబడితే మణికంఠుడు తమ మీద దాడికి సాహసించడన్న నిర్ణయానికి వచ్చారు. మణికంఠుణ్ణి ఎదుర్కొనేందుకు సైనికసన్నాహాలు ప్రారంభించారు.

తమ సైనిక సన్నాహాలు పూర్తి కాగానే రాజు లిద్దరూ, దూత ద్వారా మణికంఠుడికి వర్తమానం పంపుతూ, సప్తగిరిపై జరిగే దురాక్రమణ హిమగిరి సహించదనీ, అలాగే హిమగిరిపై జరిగే దురాక్రమణ సప్తగిరి సహించదనీ హెచ్చరించారు.

మణికంఠుడు తాను దాడి వెడల నున్నట్టు తెలిపిన రోజు రానేవచ్చింది. కాని, కర్పూరదేశ సైన్యాలు సరిహద్దులు దాటకపోగా, అసలు ఆ దేశంలో యుద్ధ ప్రయత్నాలంటూనే జరగడంలేదని చారులద్వారా తెలుసుకుని అమరేంద్రుడూ, విజయభూషణుడూ ఆశ్చర్య పోయారు. తమ సఖ్యతవల్లనే మణికంఠుడు తమ దేశాల మీదికి యుద్ధానికి వచ్చేందుకు భయపడ్డాడని వాళ్లు గట్టిగా విశ్వసించారు. మణికంఠుడి యుద్ధ ప్రకటన సప్తగిరి, హిమగిరి రాజ్యాల మధ్య శాశ్వతమైత్రికి దారితీసింది.

ఈ విధంగా కర్పూరదేశపు మంత్రి వేసిన పథకం వల్ల, రెండు శత్రురాజ్యాల మధ్య స్నేహం కుదరడమేగాక, ఆ దేశాల ద్వారా కర్పూరదేశానికి వచ్చే నిత్యావసర వస్తువుల రవాణా సమస్య కూడా పరిష్కారమైపోయింది.





# విఘ్నేశ్వరుడు

గంగా పార్వతుల మధ్య ద్వేషం వర్ధిల్లుతుండగా, గంగాపుష్కరం వచ్చింది.

నారదుడు పార్వతితో, ''ముక్కోటి దేవతలు వారి వారి మహత్తులు, శక్తులు గంగాజలానికి సంక్రమించేలాగ పుష్కర స్నానాలు చేస్తున్నారు. అమ్మా గౌరీ! నీవు కూడా అలాగ చేస్తే, విశాల హృదయం గల మంచిదానివి నీవేనని, లోకం నిన్నే మెచ్చుకుంటుంది!'' అని చెప్పి అలాగే వెళ్లి, గంగతో, ''గంగాభవానీ! నిన్ను పావనం చేద్దామని పార్వతి విజయం చేస్తున్నది, తెలుసా!'' అన్నాడు.

''అలాగా! దయాదాక్షిణ్యాలు చాటుకుందామని వస్తున్నదా, రానీ చెపుతాను,'' అన్నది గంగ.

పార్వతి పూలు జల్లి గంగలో దిగబోతూంటే, ''అగు! నన్ను మలినపర్చకు!'' అని గంగ ఆటంకపరిచింది. ఇద్దరికీ గొప్ప వివాద సంవాదం జరిగింది.

''కుమారస్వామిని శరవణ సరస్సు కన్నది; నీ అవిటి చేతుల్లో నలిగిన బొమ్మ బాబు, పాపం, గజముఖుడయ్యాడు; నీవు మాత్రం ఒట్టిగొడ్రాలివి!'' అన్నది గంగ.

''నేనెవర్నో తెలుసా, పరమశివుని అర్ధాంగిని, భాగేశ్వరిని!'' అన్నది పార్వతి.

''తెలియకేం, కట్టుకున్న అమాయకుణ్ణి సగం తినేసిన పరమ పాతకివి?'' అన్నది గంగ.

''జారిపడిన భ్రష్టురాలివి నువ్వు!'' అన్నది పార్వతి.

## 10. గోదావరి అవతరణ



"హాలాహలం గొంతు దిగకుండా మ్రింగిన తాపాన్ని చల్లార్చితే మెచ్చి, నచ్చి, మనోహర కుసుమ సుకుమారి గా తలను దాల్చిన జగద్రక్షకుడికి ఇష్టురాలినో, భ్రష్టురాలినో లోకానికి తెలుసు!" అంది గంగ.

"ఎవరో పిలిస్తే వస్తూ చిక్కులుపడిన అర్భకురాలివి, పల్లమాలిన సుకుమారితనం దేనికి ?" అన్నది పార్వతి.

"నువ్వలాగే అంటావులే! బలులు కోరే జాలిలేని అమ్మతల్లివి! వామాచారిణివి, మలినవు, అంటరాని మాతంగివి, మోటుదానివి, శక్తివి !" అని గంగ గడగడా అనేసింది.

"బాగా గుర్తు చేశావు గంగా! ఔను, నేను శక్తిని, మహాశక్తిని!" అంటూ పార్వతి ఆవేశం పొందింది. ప్రళయ ప్రభంజనాలు వీచాయి. చీకట్లుకమ్మాయి. మెరుపులతో ఆకాశం గర్జించింది. పిడుగులుపడ్డాయి. భూమి కంపించింది. మంచుశిఖరాలు కరిగాయి.

పార్వతి ఆవేశానికి గంగ పరిహాసం చేస్తూ, "చాల్లే! చల్లనిదాన్నికదా అని నన్ను చిన్నచూపు చూశావే కాని, నేను జలశక్తిని అన్న సంగతి మరిచావు; నన్ను రెచ్చగొట్టిన పాపం నీదే!" అంటూ గంగ హిమాలయ శిఖరాగ్రాల ఎత్తున పొంగింది. గంగానది పరవళ్లు తొక్కుతూ ఉత్తరభూమిని జలమయం చేసింది.

దేవతలు బారులు తీర్చి ఆకాశం మీది నుంచి జరిగిన భీభత్సాన్ని చూస్తూ, "అమ్మలు ఆడిపోసుకోవడం కాదుగాని ప్రళయం తెచ్చిపెట్టారు !" అని నిట్టూర్చి, కలహబీజం నాటిన నారదుణ్ణి ఒక్కుమ్మడిగా నిందించారు.

విఘ్నేశ్వరుడు దక్షిణం నుంచి తిరిగి వస్తూ, నారదుణ్ణి చూసి, "కలహభోజనా, కడుపు నిండిందా ? ఎంత ఉపద్రవం తెచ్చిపెట్టావయ్యా !" అన్నాడు.

నారదుడు, "ఇలాంటి ఉపద్రవాలు వచ్చినప్పుడే కదా కడుపు నిండిన వినాయ

కులెవరో, లోకకళ్యాణం కోసం నడుము బిగించి పాటుపడే నాయకుడెవరో తెలిసేది!'' అని ఛలోక్తి విసురుతూ వెళ్లాడు. విఘ్నేశ్వరుడు కైలాసం చేరాడు.

కైలాసంలో పార్వతి పశ్చాత్తాపంతో తనలోతాను, ''మళ్లీ మరొక భగీరథుడు తర్లించుకుపోతేనేగాని గంగ ఉధృతం తగ్గదు!'' అని గట్టిగా అనుకున్నది.

ఆ మాటలు విఘ్నేశ్వరుడు విన్నాడు. ఏమీ ఎరగనట్టు పార్వతి ముంగిటకు వచ్చి పాదాభివందనం చేసి, ''అమ్మా, ఒక మంచి పని తలపెట్టాను, ఆశీర్వదించమ్మా!'' అన్నాడు.

''విఘ్నేశ్వరుడు తలపెట్టితే అడ్డేమిటి, నాయనా! ఇంతకూ నువ్వేదో దక్షిణంగా వెళ్లివచ్చినట్లున్నావు. విశేషమేమిటి?'' అన్నది పార్వతి.

విఘ్నేశ్వరుడు, ''ఏం చెప్పమంటావు? వింధ్యకు దిగువ అంతా శూన్యంగా ఉన్నది. ఆ ప్రదేశం అంతా పైరు పచ్చగా, నీ అన్నపూర్ణ నామధేయాన్ని పొందితే ఎంత బాగుంటుంది! అనిపించిందమ్మా. గంగమ్మ కాస్త అటు వెళ్ళి చల్లగా చూస్తేకాదా, ఏమంటావమ్మా?'' అన్నాడు.

పార్వతి, ''నేననేదేముందబ్బా, అంతా ఆ విశ్వనాథుడిదేకదా భారం!'' అన్నది.




విఘ్నేశ్వరుడు, ''అలా అని మనం ఊరికే చూస్తూండవలసిందేనా? మన ప్రయత్నం ఉండాలా వద్దా?'' అన్నాడు.

''తప్పకుండా ఉండాలి. అందునా నీలాంటివాడు పూనుకుంటే జరగనిదేముంది!'' అంది పార్వతి.

''ఆ మాట చాలునమ్మా, వెళ్ళి వస్తాను,'' అని పార్వతి పాదాలు తొండంతో కళ్ళకద్దుకొని వెళ్ళిన విఘ్నేశ్వరుడు, తిన్నగా గౌతమమహర్షి ఆశ్రమ ప్రాంతానికి చేరుకున్నాడు.

గౌతముడు పడమటి కనుమలనడుమ ఆశ్రమం ఏర్పరుచుకొని, అవసరం మట్టుకు సేద్యం చేసుకుంటూ ఉన్నాడు.



విఘ్నేశ్వరుడు చూలుతో ఉన్న ఆవుగా మారాడు.

పెరిగిన చేను తొక్కుకుంటూ మేస్తున్న ఆవును అదలించి తరిమే ప్రయత్నంగా గౌతముడు కమండలం నీరు అరచేత్తో విసిరాడు. ఆ నీటిచుక్కలు పడీపడ్డంతో ఆవు పడిపోయి గిలగిల తన్నుకొని కొయ్యబారింది. గౌతముడు తన సుకృతాన్నీ, తపస్సునూ ధారబోసినా మాయదారి గొడ్డు మూసినకన్ను తెరవలేదు.

నారదుడు దేవేంద్రుణ్ణి ఉసిగొలిపాడు. ఇంద్రుడికి గౌతముడి మీద తీరని పగ ఉంది. బ్రహ్మ అపూర్వసుందరిగా అహల్యను సృష్టిచేశాడు. ఇంద్రుడు చాలా ఆశపడ్డాడు. ఇంకా చాలామంది పోటీ పడ్డారు. భూదేవిని ప్రదక్షిణం చేసి ఎవరు ముందువస్తే, అహల్య అతనిదవుతుందని బ్రహ్మ పందెం పెట్టాడు.

గౌతముడు ప్రసవిస్తున్న ఆవు చుట్టూరా తిరిగి వచ్చి బ్రహ్మతో వాదించి ఒప్పించి అహల్యను భార్యగా గెల్చుకున్నాడు.

గోవు సాక్షాత్తూ భూదేవితో సమానమని చెప్పిన ఆ గౌతముడి చేతి మీదుగా గోహత్య జరిగింది! పగ తీర్చుకోడానికి మంచి అవకాశం వచ్చిందని ఇంద్రుడు గొప్ప మునిపుంగవుడి వేషంతో తిరిగి తిరిగి, "గౌతముడు గోహత్య చేసిన మహాపాపి! అతని ఆశ్రమం మైలపడిపోయింది. గౌతముడిని చూసినా, ఆశ్రమంలో అడుగు పెట్టినా మహాపాతకం చుట్టుకుంటుంది! గంగాజలాలు ఆశ్రమసీమలో ఆవు మీద నుంచి ప్రవహించాలే తప్ప వేరే పరిహారం ఏదీ లేదు!" అని లోకమంతా చాటి, సాటి మహర్షులను రెచ్చగొట్టాడు. ఋషులు గౌతముణ్ణి వెలివేశారు. ఆశ్రమవాసులంతా వెళ్ళిపోయారు.

ఎక్కడి గంగానది! ఎక్కడి పడమటి కనుమలు! అయినప్పటికీ గౌతముడు భగీరథుణ్ణి ఆదర్శంగా పెట్టుకొని గంగాదేవిని గూర్చి హిమాలయాల్లో గొప్ప తపస్సు చేశాడు.



కపిలమహాముని కోపాగ్నికి బూడిద పోగులైన తన తాతలను తరింపజేయ డానికి భగీరథుడు జలాధి దేవతయైన గంగాదేవిని తపస్సు చేసి మెప్పించి దివి నుండి భువికి దింపాడు. శివుడు తన జటాజూటంలో గంగను ధరించాడు, గంగ గంగాభవాని అనిపించుకుంది. గంగను ఒదలమని భగీరథుడు శివుణ్ణి ప్రార్థించాడు. శివుడు జడల ముడి సడలించి గంగను కొద్దిగా ఒదిలాడు. గొప్ప వేగంతో గంగ చిమ్ముకొచ్చి నలుదెసలా హిమాలయాల్లో పడింది. భగీరథుడి వెంట గంగ ప్రవాహంగా తూర్పు ముఖంగా వెళ్లింది. గంగకు భాగీరథి అని పేరు వచ్చింది.

హిమాలయాల్లో పడిన గంగ కొంత హిందూకుశ శిఖరాల మీదుగా పడమరకు ఇందు నదిగా ప్రవహించింది. ఇందు నదినే సింధునది అన్నారు. భరతఖండానికి వాయువ్యంగా ఉన్న సింధునది మూలంగా హిందూదేశ మనే పేరు వచ్చింది.

భగీరథుడి వెంట మహా వేగంగా వెళ్తూన్న గంగను తన ఆశ్రమం పాడవకుండా జహ్నుమహాముని తాగేశాడు. భగీరథుడు జహ్ను మునిని ప్రార్థించి గంగను విడుదల చేయించాడు. జహ్ను మహా ముని చెవి నుండి గంగ వెలికి వచ్చినందువల్ల గంగకు జాహ్నవి అనే పేరు కూడా వచ్చింది. తరవాత కపిలాశ్రమం చేరి, భగీరథుడి పితరుల మీదుగా ప్రవహించి తరింపజేసి భగీరథుడి ప్రయత్నాన్ని ఫలింపజేసింది.

భగీరథుడు కూడా అంత గొప్ప తపస్సు చేయలేదని గౌతముణ్ణి మెచ్చుకొని గంగ ప్రసన్నురాలై అదే విధంగా గౌతముడి వెంట బయలుదేరింది. దారి పొడవునా గంగాదేవి అడుగు జాడల్లో ఎన్నో యేర్లు, వాగులు పుట్టాయి.

గౌతమాశ్రమం చేరుతూనే గంగ నదీ ప్రవాహమై గౌతముడు దారి చూపుతూ ముందు నడుస్తూంటే, ఆవు మీది నుంచి

జలజలా పారి గలగలా ప్రవహించి గౌతమి అని పేరు పొందింది. మాయదారి ఆవు దిగ్గున లేచి నాలుగడుగులు వేసి, అలా పైకెగసి ఆకాశంలో అదృశ్యం కాగా విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించాడు.

విఘ్నేశ్వరుడు గంగకు నమస్కరించి, "అమ్మా! తనయుణ్ణి మన్నించు. నీ దయామృత జలాలతో వింధ్యకు దిగువ నున్న భూభాగమంతా సుభిక్షం కావాలని యింత పని చేశాను. దక్షిణ గంగగా అవత రించిన నీవు, గోవును బ్రతికించి ఇచ్చి నందువల్ల గోదావరి అని పేరు పొందు తావు!" అని చేతులెత్తి మ్రొక్కి అదృశ్య మయ్యాడు.

గోదావరి అనేక ఉపనదులతో తూర్పుగా పయనించి తూర్పు మైదా నాల్ని సస్యశ్యామలం చేసింది. సప్త ఋషులు, దేవతలు గోదావరిలో జలక మాడారు. గౌతముణ్ణి ఎన్నోవిధాల శ్లాఘించి అపర భగీరథుడు అన్నారు. గోదావరి సప్త గోదావరిగా చీలి తూర్పు సముద్రాన్ని చేరింది.

గంగ గోదావరి ప్రవాహంగా మారు తున్నప్పుడు, ఆమె నల్లని వేణీభరము విరజిమ్ముకొని పడమటి కనుమల్లో చిక్కు పడింది. విష్ణువు తన చేతి వ్రేళ్ళతో ఆ చిక్కు విడదీశాడు. కృష్ణవర్ణుడైన



విష్ణువు వ్రేళ్ల సందుల నుంచి కొప్పులోని నీరు జారుతూ కృష్ణవేణి, కృష్ణానది అని పిలువబడుతూ మరొక గొప్ప నది ప్రవహించింది.

అలాగే గంగాజలం ఆకాశంలో ఎగిరి, దక్షిణంగా ఉన్న కవేరమహాముని ఆశ్ర మంలో కమండలంలో పడి, కన్యగా పెరిగి, అగస్త్యుని వెంట అరణ్యాల్లో విహరిస్తూ, కావేరీ నదిగా మారి, అంద మైన జలపాతాలతో దక్షిణసీమలో ప్రవ హించింది.

ఆ విధంగా గౌతమమహర్షి తెచ్చిన గంగ మరొక మూడు గొప్ప నదులుగా దక్షిణ భారతభూమిని సుభిక్షం చేసింది.

గంగ, గోదావరి, కృష్ణ, కావేరి అని నదుల పేర్లు చెప్పుకోవడం పరిపాటి అయింది.

గౌతముని ఆశ్రమం తిరిగి కళకళ లాడింది. గోదావరి పొడవునా అనేక క్షేత్రాలు వెలిశాయి. గౌతముడి కీర్తి కూడా వ్యాపించింది. గంగ పడమటి కనుమలకు ప్రవహించడం అనేది అసంభవమైనది గనుకనే ఇంద్రుడు ఆ విధంగా పరిహారం చెప్పాడేగాని, అసంభవాన్ని సాధించి సంభవంగా మార్చిన గౌతముడి గొప్పదనాన్ని గుర్తించి క్షమాపణ వేడుకొన్నాడు.

గౌతముడికి మాత్రం సంతోషం లేకపోయింది. అదివరకే ఇంద్రుడి మోసం కారణంగా అహల్యను బండరాయిగా పడి ఉండమని శపించి, ఉత్తరదేశం నుంచి వింధ్య దాటి పడమటి చరియలో ఆశ్రమం కట్టుకుని ఒంటరిగా ప్రశాంతంగా తపస్సు చేసుకొంటున్నాడు. గోదావరి అవతరణంతో పడమటి కనుమల్లోని మునుల ఆశ్రమాలు మరింత శోభించాయి. అత్రి మహాముని త్రిమూర్తుల అంశలతో పుత్రవంతుడయ్యాడు. అనసూయ అతిథులకు నిరతాన్న దానం చేస్తూన్నది.

గౌతముడి ఆశ్రమం చుట్టూరా కూడా సస్యసమృద్ధి విశేషంగా ఉన్నా అహల్య లేని కొరత కనిపిస్తూనే ఉన్నది. తొందరపడి అహల్యను శపించినందుకు గౌతముడు మనస్సులో విచారిస్తున్న సమయంలో విఘ్నేశ్వరుడు కనిపించి, "గౌతమా! త్వరలోనే విష్ణువు రాముడై తన పాదం మోపి, నీ భార్యను మనిషిగా చేస్తాడు. పాషాణి పునీత అవుతుంది! గోదావరి అవతరణానికిగాను, నీకు చాలా శ్రమ ఇచ్చాను. గోదావరికి గౌతమి నామం చిరస్థాయిగా ఉంటుంది!" అన్నాడు.

గౌతముడు ఆ మాటలకు సంతోషంతో, "విఘ్నేశ్వరా! అంతా నీ సంకల్ప బలం వల్లనే కదా జరిగింది! గోదావరి జలాలూ, విఘ్నేశ్వరుని కృపా ఎల్లకాలమూ రక్షిస్తూ ఉంటాయి!" అన్నాడు.





# గంధర్వ చక్రవర్తి కూతురు

పూర్వం బస్రానగరంలో హసన్ అనే యువకుడుండేవాడు. హసన్ అంటే సౌందర్యమని అర్థం. ఆ పేరు వాడికి సార్థకమయింది. ఎందుకంటే ఆ కాలంలో బస్రానగరంలో హసన్ వంటి సౌందర్యవంతుడు మరొకడు లేడు. వాడు తల్లిదండ్రులకు ఒక్కడే బిడ్డ కావటంచేత కాస్త గారాబంగా పెంచారు. దానికి తగ్గట్టు వాడి తండ్రి వాడి చిన్నతనంలోనే చనిపోయాడు. తరవాత కొద్దికాలంలోనే తండ్రి మిగిల్చిన డబ్బు కాస్తా హసన్ మిత్రులతో విందులు చేసి తగలేశాడు.

ఆ తరవాత వాడి తల్లి తన డబ్బుతో పెద్ద బజారులో ఒక నగలు చేసే దుకాణం కొని పెట్టింది. వాడు రోజూ ఆ దుకాణంలో కూచుని బంగారు నగలు చేస్తూ ఉండేవాడు. వాడి అందం దారే పోయే పిన్నలనూ, పెద్దలనూ ఆకర్షించేది.

ఒకనాడు హసన్ తన దుకాణంలో కూచుని పని చేసుకుంటూండగా ఒక పర్షియాదేశపు వృద్ధుడు, తెల్ల తలపాగా ధరించి, పొడుగాటి తెల్లని గడ్డంతో సహా అటుగా వెళుతూ హసన్‌ను చూసి ఆగిపోయాడు. మనిషి చూస్తే చాలా గౌరవనీయుడిలాగున్నాడు.

ఇంతలో మధ్యాన్నపు ప్రార్థనలకు వేళ అయింది. వీథులన్నీ ఖాళీ అయాయి. వృద్ధుడు హసన్ దుకాణంలోకి అడుగు పెట్టి హసన్‌కు సలాం చేశాడు. హసన్ తిరిగి ఆ వృద్ధుడికి సలాం చేసి ఆయనను కూచోమని మర్యాదచేశాడు.

వృద్ధుడు కూచుని చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, నాకు సంతానం లేదు. నిన్ను చూడగానే పెంచుకోవాలనీ, నా విద్య నీకు నేర్పాలనీ కోరిక కలిగింది. నా అనంతరం నీవు ఆ విద్యను అభ్యసించవచ్చు.



ఇలా నగలు చేసి శ్రమపడి నీ అందమూ, ఆరోగ్యమూ చెడగొట్టుకోవలిసిన అవసరం లేదు. నా విద్య ఎంత అపురూపమైనదంటే దాన్ని సంపాదించటానికి ఎన్ని వేల మందైనా ప్రాణాలు అర్పించి ఉందురు. నిన్ను ఈ దుకాణంలో చూసేవరకూ నాకు ఈ విద్యను మరొకరికి నేర్పాలనే ఆలోచనే రాలేదు,'' అన్నాడు.

అంతా విని హసన్, ''సరే, నన్ను పెంచుకుని నాకు మీ విద్య నేర్పెయ్యండి. ఎప్పుడు నేర్పుతారు?'' అని ఆత్రంగా అడిగాడు.

''రేపు,'' అని చెప్పి పర్షియను అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆనందంతో కూడిన ఆరాటంలో హసన్ దుకాణం మూసేసి, తల్లి దగ్గిరికి పరిగెత్తుకుపోయి, ఈ సంగతంతా ఆమెతో చెప్పాడు.

ఆమె హసన్‌తో, ''నాయనా, పర్షియన్ నాస్తికుల మాటలు నమ్మవచ్చా? వాళ్ళు అగ్నిని ఆరాధిస్తారు. వాళ్ళకు తెలిసిన విద్య బంగారం చెయ్యటం. కాని వాళ్ళ స్నేహం చేసినవాళ్ళెవరూ, బాగుపడరు, నాశనమైపోతారు,'' అన్నది.

హసన్ నిర్లక్ష్యంగా నవ్వి, ''అమ్మా, మనం పేదవాళ్లం. మన నుంచి ఎవరూ ఏమీ దోచుకోలేరు. ఆ ముసలాడు ఎంతో యోగ్యుడులాగున్నాడు. ఆయన దయ మన మీద ప్రసరించటం వల్ల మనకు లాభమే కలుగుతుంది,'' అన్నాడు.

ఎటూ చెప్పలేక తల్లి ఊరుకున్నది. ఆత్రంతో తహతహలాడిపోతూ హసన్ ఆ రాత్రి కన్ను మూయలేదు. మర్నాడు తెల్లవారుతూనే వాడు లేచి తన దుకాణానికి వెళ్ళాడు. కొద్దిసేపట్లో పర్షియను వచ్చాడు. ఆయన హసన్‌ను కౌగలించుకుని, ''నీకు పెళ్లి అయిందా, బాబూ?'' అని అడిగాడు.

''ఇంకా లేదు. మా అమ్మ నన్ను పెళ్ళాడమని చాలా రోజులుగా తొందర చేస్తోంది,'' అన్నాడు హసన్.

"భేష్! నా విద్య బ్రహ్మచారులకి మాత్రమే చెప్పేది," అంటూ వృద్ధుడు, "పాత రాగి ఏమైనా నీ వద్ద ఉన్నదా?" అని అడిగాడు.

హసన్ విరిగిపోయిన రాగిపళ్లెం ఒకటి తెచ్చి వృద్ధుడికి చూపాడు.

"అదే కావలసింది. ఈ రాగిని ముక్కలు ముక్కలుగా నరికి ఆ ముక్కలను మూసలో పెట్టి, కొలిమిలో పెట్టి, తిత్తిపోసి కరిగించు," అన్నాడు వృద్ధుడు.

త్వరలోనే హసన్ ఆ పాత రాగిని కరిగించాడు. అప్పుడు వృద్ధుడు లేచి వచ్చి, "హక్, మక్, బక్! రాగి బంగారం కావాలి!" అని మూడుసార్లు అని, తన తలపాగా మడతల్లో నుంచి ఒక పొట్లం తీసి, అందులో నుంచి కుంకంపువ్వు రంగుగల పొడి చిటికెడు తీసి మూసలో వేశాడు. వెంటనే మూసలోని రాగినీరు గడ్డకట్టుకుపోయి బంగారు కణిక అయింది

హసన్ ఇది చూసి నివ్వెరపోయాడు. వృద్ధుడి ఆదేశానుసారం అతను ఆ కణికెను గీటురాయి మీద గీసి చూస్తే అది కల్తీలేని మేలిమి బంగారమని రుజువయింది. ఆ బంగారానికి నగల వర్తకులు మంచి ధర యిస్తారు.

వృద్ధుడు హసన్‌తో, "వెంటనే దాన్ని తీసుకుపోయి బజారులో అమ్మి డబ్బు తెచ్చుకో. ఇది ఎలా వచ్చిందీ, ఎవ్వరికీ చెప్పకు," అన్నాడు.





"దీన్నికూడా బంగారంగా మార్చుదాం," అన్నాడు హసన్.

వృద్ధుడు నవ్వి, "ఒక్కరోజు నీ దగ్గిర ఇంత బంగారం ఎలా వచ్చిందని అందరూ అనుమానించరా? నీ రహస్యం ఎలా దాగుతుంది?" అన్నాడు.

"అది నిజమేగాని, మీ విద్య త్వరగా నేర్చుకోవాలని నాకు తహతహగా ఉంది," అన్నాడు హసన్.

వృద్ధుడు గట్టిగా నవ్వి, "ఇది నడి బజారులో నేర్చుకునే విద్య అనుకున్నావా? నిజంగా ఈ విద్య నేర్చుకోవాలని వుంటే నీ పనిముట్లతో మా యింటికి రా," అన్నాడు.

హసన్ దాన్ని రెండు వేల దీనారాలకు అమ్మి, ఆ డబ్బు తీసుకుని ఇంటికివెళ్ళి తల్లికి చూపించి, ఇదంతా పర్షియను దయ వల్లనే సాధ్యపడిందని చెప్పాడు. ఈ మాట అన్నందువల్ల తల్లి అనుమానాలేవీ రహితం కాలేదు, అయినా హసన్ ఆమె అనుమానాలు లక్ష్యపెట్టక, తమ వంట ఇంట్లో ఉండే ఇత్తడి సన్నికల్లు తీసుకుని తన దుకాణానికి పరిగెత్తాడు.

వృద్ధుడింకా దుకాణంలోనే ఉన్నాడు. హసన్ సన్నికల్లును ఒకపక్క పెట్టి కొలిమికి తిత్తిపోసి మంట చేస్తూండటం చూసి వృద్ధుడు, "ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

సరేనని హసన్ వృద్ధుడి వెంట బయలు దేరాడు. కాని వీధిలో నడుస్తూండగా అతనికి, పర్షియను నాస్తికులను గురించి తన తల్లి చేసిన హెచ్చరిక జ్ఞాపకం వచ్చింది. అతను నడిచేవాడల్లా చప్పున ఆగిపోయి తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. ముసలివాడు ఆ సంగతి గ్రహించాడు.

"బిడ్డా, నిన్నేదో సంకోచం పట్టి పీడిస్తున్నట్టున్నది. ఈ పరుసవేది విద్యను మా ఇంట నేర్చుకోవటానికి నీ కేమైనా అభ్యంతరం ఉంటే మీ యింటికే వచ్చి నేర్పుతాను," అన్నాడు వృద్ధుడు.

అలా చేస్తే తన తల్లి భయాలకు తావుండదనుకుని హసన్ సరేనన్నాడు.

ఇద్దరూ కలిసి హసన్ ఇంటికి వెళ్ళారు. వృద్ధుణ్ణి బయట వసారాలో ఉండమని హసన్ లోపలికి వెళ్ళి, "అమ్మా, ఆయన మన ఇంటికి ఆతిథ్యానికి వచ్చాడు. ఒక సారి మన ఉప్పు తిన్నాక ఇక మన కెలాటి ద్రోహమూ చెయ్యడు," అన్నాడు.

"నాయనా, అలాటి పట్టింపులు మనకే గాని అగ్నిని పూజించే నాస్తికులకుండవు. నీ క్షేమం గురించి నా ఆరాటం తీరిందను కోకు. అతిథిని తెచ్చావు గనక వంట చేసి పెడతాను గాని, ఆ మనిషి లోపలికి వస్తే నేనీ చూరుకింద కూడా ఉండను. పొరుగింటికి వెళ్ళి ఆ మనిషి వెళ్ళిపోయాకే మళ్ళీ ఇంట అడుగుపెడతాను," అన్నది, హసన్ తల్లి.

అలాగే ఆమె రకరకాల కూరలు కొని తెచ్చి పుష్కలంగా వంటకాలు తయారు చేసి, వాటిని తినటానికి సిద్ధంగా ఉంచి పొరుగింటికి వెళ్ళిపోయింది.

తరవాత హసన్ వృద్ధుణ్ణి లోపలికి తీసుకువచ్చి భోజనానికి కూచోబెట్టి, "మా యింట మీరు భోజనం చేశాక మన మధ్య బంధం ఏర్పడుతుంది," అన్నాడు.

"అది చాలా పవిత్రమైన బంధం, నాయనా! నీ మీద ఎంతో ప్రేమ లేకపోతే ఈ అపూర్వమైన విద్య నీకు చెబుతానా?" అంటూ వృద్ధుడు తన తలపాగాలో నుంచి పొట్లం తీసి, "చూడు, ఇందులో ఉన్న పొడితో ఎన్నో మణుగుల బంగారం చేయవచ్చు. ఇందులో వెయ్యి మూలికలూ, వెయ్యి దినుసులూ చేర్చి ఎంతో శ్రమపడి తయారు చేశాను. ఆ పద్ధతంతా నీకు నేను చెబుతాను," అంటూ ఆ పొట్లాన్ని హసన్‌కు అందించాడు.

హసన్ ఆ పొడిని ఆశ్చర్యంతో చూసే సమయంలో హసన్ పళ్ళెంలో కొంత ఆహారం పెట్టి అందులో వృద్ధుడు మత్తు మందు కలిపి, "తిను, నాయనా!" అన్నాడు.

హసన్ ఒక్క ముద్ద నోట పెట్టుకుంటూనే స్పృహతప్పి పడిపోయాడు.

—(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







Brahm Dev M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ అక్టోబర్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## అగష్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : శుభకాలంటే ప్రియం

రెండవ ఫోటో : లేదు నాకిక భయం

పంపినవారు : శ్రీమతి ఎమ్. పద్మ, c/o ఎమ్. మోజెస్, మిర్యాలగూడ.

బహుమతి మొత్తం రు. 25/—నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

Cut here

ENTRY FORM

# Cadbury's Gem of A Poem Contest




Cut out this page.
Fill in your name, age and address here.
Mail it to Cadbury India Ltd., P.O. Box No. 26515, Bombay 400 026.

Name ______________________________

______________________________ Age ______

Address ______________________________

______________________________

______________________________

______________________________



Write your poem neatly in this space:

______________________________

______________________________

______________________________

______________________________

OBM/7075

everest/81/PP/291-tl




# ముద్దుగా పిల్లలు ముద్దు నవ్వుతూ మురిపిస్తారు

వారికి ప్రీతితో యివ్వండి

## పార్లే గ్లూకో

## మజా రుచితో ఎంతో శక్తితో

పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్ మజా
రుచులతో నిండి, పుష్టినిచ్చే లక్షణాలు గలది.



వరల్డ్ సెలక్షన్
బహుమతిని గెలుచుకున్నది




భారతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్